సాహిత్య

# ప్రస్థానం

మే 2016

వెల రూ. 10



సాహితీస్రవంతి

సాహిత్య ప్రస్థానం
మే 2016
సంపుటి : 15 సంచిక : 5

# అసలు ప్రోత్సాహం

ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాహిత్య, కళా, సాంస్కతిక, తదితర రంగాలలో కృషిచేసిన వారికి పురస్కారాలు అందించింది. పురస్కారాలు పొందిన వారందరూ అభినందనీయులే. నిజానికి సాహిత్య, సాంస్కృతిక రంగాలకు ప్రభుత్వాలు చేస్తున్న కృషి నామమాత్రమే. పురస్కారాల వంటివి ప్రకటించి చేతులు దులుపుకోవడం తరచూ ప్రభుత్వాలు చేసే పనే తప్ప నిర్మాణాత్మకమైన చర్యలు శూన్యం. రచయితల పుస్తకాలు కొనుగోలు చేసి ప్రజలకు అందించే పని చేయాల్సిన ప్రభుత్వాలు ఆ పని చేయడం లేదు. టీ.వి. మాధ్యమం విస్తరించిన తర్వాత పుస్తకాలు చదివే పాఠకుల సంఖ్య పడిపోయింది. రచయితలు, ప్రచురణ కర్తలు పుస్తకాలు ప్రచురించడానికి భయపడుతున్న పరిస్థితులు నెలకొన్నాయి. ఇలాంటి సందర్భంలో మంచి పుస్తకాలను గుర్తించి ప్రభుత్వం కొనుగోలు చేసి గ్రంథాలయాల ద్వారా ప్రజలకు అందించాలి. స్వాతంత్ర్యోద్యమకాలంలో ప్రజల అవగాహనను, చైతన్యాన్ని పెంపొందించడంలో గ్రంథాలయాల పాత్ర అందరికీ తెలిసిందే. స్వాతంత్ర్యానంతరం వాటి ప్రాధాన్యతను పెంచాల్సిన మన ప్రభుత్వాలు అందుకు భిన్నంగా గ్రంథాలయాల వ్యవస్థను నీరుగార్చాయి. ప్రజలకు సేవలందించే గ్రంథాయాల వంటి పలు ప్రభుత్వ వ్యవస్థలను రద్దు చేస్తున్నాయి. ప్రభుత్వాలన్నీ ప్రపంచీకరణ పేరుతో పెట్టుబడిదారులకు లాభాలు చేకూర్చే ఆర్థిక విధానాలను అమలుచేయడమే దానికి కారణం. దాంతో విచక్షణ లేని ప్రైవేటీకరణ విధానాలు వెర్రితలలు వేసి సమిష్టి విలువలను ధ్వంసం చేస్తున్నాయి. ఫలితం మానవతా విలువలు అదృశ్యమై, అరాచక అత్యాచార, ఆత్మహత్యల సంస్కృతి రోజు రోజుకూ విస్తరిస్తుంది. అమానవీయమైన పరిస్థితులు అందరినీ ఆందోళన పరుస్తున్నాయి. వీటిని కట్టడిచేయడానికి ప్రగతిశీలురు, ప్రజాస్వామిక వాదులు, మేధావులు, బుద్ధిజీవులు కలిసికట్టుగా కృషిచేయాలి. ముఖ్యంగా రచయితలు తమ కలాలకు పదును పెట్టాలి. ప్రజల్ని ఇబ్బందులకు గురిచేస్తున్న విధానాల దుష్ఫలితాలను తమ రచనల ద్వారా ఎండగట్టాలి. ప్రజల్ని చైతన్యపరిచే రచనలు చేయాలి. అదే నేటి సాహిత్యరంగ కర్తవ్యం కావాలి. రచయితలంతా ఆ దిశగా సాగాలి. పురస్కారాలు పొందిన వారు మరింత ఉత్సాహంగా ఉత్తేజకరమైన సాహిత్యం అందిస్తారని ఆశిద్దాం.

కవర్ డిజైన్ : గిరిధర్

బొమ్మలు : తుంబలి శివాజి, గంగాధర్, మీరా

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# గ్లోబల్ గొడుగు

❖ బిరుసు సురేష్‌బాబు
7569480800

జల్లుల్లో గంతులేస్తుంటే
వడగండ్లు పడతాయని భయపెట్టావు
ఎవ్వరిని తడవనివ్వనన్నావు
అమెరికాలో సామ్రాజ్యవాద ఫ్యాక్టరీలో తయారు చేసిన
గ్లోబల్ గొడుగు కిందికి
అందర్నీ రమ్మన్నావు
బయట వాన తగ్గింది
గొడుగు కింద మాత్రం వాన మొదలైంది
బయటికొద్దామంటే బంధించిపెట్టావు
వాన కాస్తా నిప్పుల వర్షంగా మారింది
తలలో నిప్పులు, కళ్ళల్లో నిప్పులు
ఒళ్ళంతా నిప్పులు, నిప్పులు
నిప్పుల్లో కాలిపోతూనే ఉన్నాగానీ
చచ్చిపోలేకున్నా
కాలుతున్న కళ్ళతో బయటకు కలయజూస్తే
పూలతోటలపై
అణుబాంబులు విసుర్తూ నువ్వు కనిపించావు
నా పక్కనే ఉన్నావనుకున్న నువ్వు
ఎప్పుడు బయటకు జారుకున్నావో?
నాతోపాటూ కాలుతున్నవారు హాహాకారాలు చేస్తుంటే
కార్పొరేట్ డాక్టర్‌ను రప్పించి
ఎ.కె. ఫార్టీ సెవెన్‌తో సర్జరీ చేయించావు
స్థోమతలేని నావైపు



మా ధర్మాసుపత్రి డాక్టర్‌ని
గొంతు నులిమి చంపేశావ్
దాహమేసి
నేను తాగుదామనుకున్న అక్షర బిందువుల్ని
ఆకాశంలోకెగరేసి
చేతనైతే వెళ్ళి తెచ్చుకోమన్నావ్
నన్నిక్కడ ఎందుకు బంధీ చేశావో
ఇప్పుడర్థమయ్యింది
నీ కన్ను నా ఇంటిపై పడింది
ఇల్లు పీకి పందిరేసినట్లు
సర్కారు కొలువులపై
ప్రైవేట్ పడగలు కొలువుదీరాయి
రిజర్వేషన్ల మంచినీళ్ల ట్యాంకుకు
తూట్లు పొడుస్తున్నది నువ్వేకదూ
మా పెరట్లోని పచ్చదనాన్నంతా
ఫ్యాక్టరీ గొట్టాలతో మసిచేసి నలుపెక్కిస్తున్నావే?
జాగ్రత్త!
అవి ఎరుపెక్కుతయ్
ఇంత జరుగుతున్నా
వాడేమిటి పట్టించుకోకుండా
చెప్పులు కుడుతూనే ఉన్నాడు?



---

## ఏప్రిల్ నెల పురస్కారాలు



**నాన్నకు ప్రాణంతో**
కథకు: రూ.700/-
రచయిత : చందక గాయత్రి రావు



**అనాదిగా...!**
కవితకు : రూ .500/-
రచయిత : ఎ. తిప్పేస్వామి

సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

◆

వ్యాసం : దళిత జీవిత వాస్తవిక చిత్రణ రచయిత : బిరుసు సురేష్ బాబు
ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం రూ.500/- అందజేయబడుతుంది

◆

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

కథ

# బుగ్గి

❖ జగదీశ్ మల్లిపురం
9440104737



చీకటంతటినీ రెండు మూటలుగా కట్టి కావిడి చేసి భుజానికెత్తుకున్నట్టు నడుస్తున్నాడు బూగన్న బొగ్గుల కావిడితో. ఆ బరువుతో అతనలా నడుస్తోంటే అతని భుజమ్మీది కావిడి బద్దా, మొల మీది గోచీ గుడ్డా లయబద్ధంగా వూగుతున్నాయి.

పొద్దెక్కడానికింకా సమయముందని తూరుపు కొండ మీది వెలుగు చెప్తోంది. నడవడానికింకా చాలా దూరముందని ఒంటి మీది చెమట చుక్కలు చెప్తున్నాయి. బూగన్న నడుస్తున్నాడన్న మాటే గానీ అతని దృష్టంతా తనను నడిపిస్తోన్న దారి మీదే వుంది. మ(ఱ్)రెండడుగులు వేస్తే చింత మాను కురికి దిగిపోతాడు. అక్కడికి రెండడుగులేస్తే గెడ్డ, గెడ్డ దాటితే పొలం గట్లు... అవీ దాటితే తా(ర్)రోడ్డు.

అక్కడి దాకా బెంగ లేదు. ఎప్పుడూ..? ఏ పారిస్టోడూ, ఏ పాపిస్టోడూ అడ్డగించకపోతే.

మరక్కడికి చేరాలంటే పొద్దు బారడెక్కినంత నడాల. ఎక్కడా అలుపుదీర్చడానికి కూడా ఆగకుండా.

ఆగితే? పొద్దు దాటిపోయి, పారిస్టోడి బండి ఎదురౌతాది. ఆడి బండి ఎదురయ్యిందంతే నా(ల్)రోజుల కష్టమంతా బుగ్గిపాలైనట్టిగే. రెండు రోజులుగా కాలుతున్న బొగ్గుల బట్టీ కళ్ల ముందు కనబడింది. పార పనీ, గొడ్డలి పనీ ఆపై రెండు మూడు రోజుల కాపలా. అన్నీ కళ్ల ముందు కదలాడేయి.

అడివిలోన ఎండిన క(ర్)రల్నీ, మొజ్జుల్నీ మోసుకు రావాల. ఒక్కడూ ఐతే సాల్లేమని ఇద్దరిని తెచ్చేడు కూలికి మాట్లాడేడు. ఒక్కొక్కరికీ రోజుకి వందా, పూట భోజనం, సాయం(త్)రానికి సారా. ఒక రోజు ఒకడొస్తే మరొక రోజు మరొకడు రాడు. ఇద్దరొచ్చిన రోజు ముసిల్దాయి ముసుగేస్సింది. నానా బాదలూ పడి బట్టి తప్పడం మొదలెట్టిన మూడు రోజులుకి పని పూర్తి చేసేడు.

ముసిలోడు అడివి దాటడానికింకా చాలా నడవాల్సి వుంది. అతడి దృష్టంతా దారి మీదే వుంది. నేలరాలుతున్న చెమట చుక్కలు గానీ, భుజాల మీద వూగుతున్న బొగ్గుల మూటలు గానీ అతని ఆలోచనల్లో లేవు. దారీ... దారి పొడుగునా తన దారికడ్డం రాబోయే వారి గురించే ఆలోచనలు...

కనబడిన వోలందరూ తన మీద పగబట్టినట్టే కనబడుతున్నారు. పారిస్టోడంటాడు.... బొగ్గులు కాలిస్తే అడివి తరిగి పోతుందని, సెట్లు నాశినమైపోతున్నాయని. "ఎన్ని సెట్లు

నరికితే ఒక బస్తా బొగ్గులయ్యాయి వోయ్" అని ఊరు బడిలో సెపుతున్న మేష్టు అడుగుతాడు. 'అదేదో అడివంతా నీను బొగ్గులు కాలిస్తేనే నాశినమైపోతున్నట్టిగ మాట్లాడతారు' రోడ్డు మీద లారీల్లారీలు కలప పట్టికెలిపోతుంటే మాత్రం ఎవులూ ఉలకరూ పలకరూ... ఎవుడైనా అడిగితే దానికి పెర్మిసనుందివోయ్... అది మంత్రిగారిదని బుకాయించేస్తాడు. దోసికి దొబ్బిడానికి అనుమతులూ... బతకడానికి బొగ్గులు కాలిస్తే బొక్కల తోసీడాలా? ఇదేమి నాయివో... లమ్డికొడుకుల నాయిము!! నా కడుపు మాడి రెండు మెతుకులు దొరుకుతాయని ఈ పనిసేస్తే అన్నేయమూ... లారీల్లారీలు నరిక్కెలిపోతే నాయమైపోయిందా? నీను సేస్తే తప్పు... ఆడు సేస్తే ఒప్పా? అడివి మీదే అనీసి పట్టాలిచ్చి పొటోలు తీసినపుడు 'ఇక నుండి అడివి మీది బతకడం కోసం కట్టెలు కొట్టుకోవచ్చని' పోజులిచ్చేరు. గానీ పారిస్టోడికి ఎదురైనపుడు ఆమాటే సెప్తే "అటవీ హక్కులు" కాగితాలు నూబెట్టి అడివి నరికేస్తావంతే మీమొప్పుకుంతామేటని బొక్కల తోసెస్తాడు.... గవర్మెంటోడి దొంగ నీతి!



ముసిలోడి మొలమీద ఊగుతున్న గోచి గుడ్డ తడిసి పోయింది...చెమటతో. భుజమ్మీది కావిడిబద్ద బరువెక్కడం తెలుస్తోంది. గెంజితాగి బయలెల్లినా బాగున్నను కున్నాడు...'గెంజి తాగడానికి పొయ్యి ముట్టాల గదా' అని సమాధాన పరుచుకున్నాడు వెంటనే. చెట్ల సందుల్లోంచి పొద్దు బొల్లి మచ్చల్లా పడి దారి చూపెడుతోంది. దారంతా రాళ్ల మయం...గతుకులు గతుకులు, ఎగుడు దిగుడులు...

మండుతున్న బొగ్గుల బట్టి కనపడింది. ఓ సారి పారిస్టోడు తన బొగ్గుల్ని ఎలా ఎత్తుకు పోయాడో గుర్తొచ్చింది....

బట్టీ ఎర్రగా మండుతోంది. కన్నాల్లోంచి పొగ నెమ్మదిగా బయటకు వొస్తోంది. గాలి వేగం ఓ మాదిరిగా వుంది. అది ఏమాత్రం ఎక్కువ వీచినా కన్నాల్లోంచి గాలి దూరి లోపల బొగ్గులు మండిపోతాయి, అలా జరిగితే మిగిలేది బొగ్గులు కాదు బుగ్గే. అలా జరక్కుండా వుండాలంటే కుండతో నీలు పక్కనే వుండాల. నీల కుండ పట్టుకొని హాస్టలు బోరింగు వైపు అడుగులేస్తుంటే మోటరు బైకు శబ్దం ఆలకించేడు. ఎప్పుడూ వొచ్చే షావుకారని అనుకుని ముందుకెలి పోతుండగా బట్టి పక్కనే బండి ఆగింది. బండి మీద నుండి పారెస్టు గార్డు దిగేడు. నీళ్లకని వెల్తుంటే పారిపోతున్నాడేమోనని పరిగెత్తి వొచ్చేడు. ఆ గాబరాకి రాయితగిలి ముందుకు తూలి పడిపోయేడు. ముఖం గట్టుకి గుద్దుకున్నాడు. ఆ శబ్దానికి బూగన్న వెనుతిరిగి చూసేడు. చేతినున్న కుండ వొదిలేసి గార్డుని పట్టుకుని మంచమ్మీద కుర్చోబెట్టి "సూసుకోవా బాబూ!" అని పలకరించేడు. "నన్ను సూసి పారిపోతావురా లమ్డీకీ" అన్నాడు పలకరింపుకి ప్రతిగా. అతని ముఖం మట్టి కొట్టుకుపోయుంది. దానికి తోడు కోపంతోను, దెబ్బతిన్న అహం తోనూ మరింత ఎర్రబడి వుంది.

"పారిపోయినోడినైతే ఎదురెందుకొస్తాను బావు?" అని పక్కనే వున్న కంపురొద్ద ఆకుల్ని తెంపి రెండు అర చేతుల్లో నలిపి రసం కారేలా పిండుతున్నాడు.

"ఏట్రా ఎదురు మాట్లాడుతున్నావు?" అని పేంటు పైకెత్తి ముడుకు చూసుకుంటున్నాడు.

రగిడిన చోట రసం పిండుతూ... అన్నాడు బూగన్న "సిన్న మంటవుద్ది బావూ వోర్సుకో... బేగి మానుతాది పుండు నీరు పట్టదు"

"ఒరే సంపెస్తావేట్రా!" అని అరిచేడు గార్డు గాయం మంటకి. కంపు రొద్ద పిప్పిని గాయానికి ఒత్తుతూ అన్నాడు బూగన్న మళ్లీ "నీకు పున్నిముంతాది బొగ్గులొదిలీ బావు" అని. ఆ మాట గార్డు మరోలా అర్థం చేసుకొని "ఇంత సేవ సేసింది ఒగ్గీమని సెప్పడానికిరా?" అన్నాడు. కాదని ఎంత చెప్పినా గార్డు మనసు కరగలేదు. ఒదల్నన్నాడు. కాదంటే కేసు కట్టేస్తాననీ అన్నాడు. ఎక్కువ మాట్లాడితే బొక్కలో తోయించేస్తానని బెదిరించేడు. బూగన్న కాళ్లు పట్టుకొని బ్రతిమాలేడు. కష్టాలన్నీ ఒక్కొక్కటీ వివరించి చెప్పేడు. చివరికి ఒక ఒప్పందానికొచ్చేడు. బట్టి ఆర్పిన తరువాత సగం మూటలు గార్డుకిచ్చీయాలని. ఒప్పుకొని తీరాల్సిన ఒప్పందం. తల వూపేడు బూగన్న. అప్పటికే బొగ్గులు బొక్కల్లోంచి మంట ఎత్తిరింది.

కొండ దారి పొలం దిగింది. గట్టుమీద కావిడి నడక. పొద్దు మరింత పైకెక్కింది. మరింత జాగ్రత్తగా నడవాలిప్పుడే. ఊరు దగ్గరవుతున్నపుడే దొరికిపోయే ప్రమాదాలు ఎక్కువ. ఎవరి కంటా పడకూడదూ... వీధులంట తిరిగి అమ్మకం జరిగిపోవాలి. గేసు పొయ్యి రాడంతో బొగ్గులు బేరం పోయింది. ఎక్కడ బొగ్గులు కొంతారో ఆ ఈదిలంటే అమ్మాల... అమ్మకంలో నష్టం రాకూడదు. నష్టం సంగతి దేవుడెరుగు...కేసు కాకుండగుంతే సాల్ను.

ఆ రోజూ బొగ్గుల బట్టీ కాలుతోంది నిశ్శబ్దంగా. గాలి రివ్వున వీయడం మొదలు పెట్టింది. నిలబడి గాలిని

గమనించేడు. ఇది ఒదిలే గాలి కాదని గబగబా అడుగులు వేయడం మొదలెట్టేడు. బోరింగు నుండి నీళ్లు తేవడానికి. దూరంగా హాస్టల్ గోడ దాటి బోరింగు చేరుకున్నాడు. అప్పటికే కొందరు హాస్టల్ పిల్లలు భోజనాలు చేసి ప్లేట్లు కడుక్కుంటున్నారు. వాళ్లు ఖాళీ చేసే దాకా ఆగితే బొగ్గులు మండి పోవచ్చని గాబరా పడి పిల్లల్ని బతిమాలి నీళ్లు పట్టుకున్నాడు.గబగబా బొగ్గుల బట్టిని చేరుకొని తడిపేడు.మరో రెండు కుండల నీళ్ళు పోసి మరో కుండనీళ్లు ప్రక్కనే పెట్టుకున్నాడు. రాత్రంతా నీళ్ల కుండల్తో కాపలా కాసేడు. నాలుగు కొయ్యలు పాతి రెండు ఎండు కొమ్మల్తో వేసిన పందిరి కింద నులక మంచం మీద చేర బడ్డాడు. పైన చుక్కలాకాశం. చుట్టూ చలి నిండిన ఆకాశం. దూరంగా ఊరిలోంచి కరెంటు స్తంబాల వెలుగు ... మరో వైపు అడవి లోంచి ఏదో జంతు సవ్వడి. మరో వైపు ఊరు మీది నుంచి వీస్తోన్న సన్నటి గాలి. ముసిలోడి చుట్టూ ముసురుకున్న ఆలోచనలూ. దేశమెలిపోయిన పెద్ద కొడుకు... ఎలా వున్నాడో... ఏమి పని చేస్తున్నాడో...ఎప్పుడొస్తాడో!!! చెవిలో దోపిన చుట్టని తీసి ముట్టించేడు.



పొగ వదుల్తూనే ఆలోచించ సాగేడు. ముసిల్దాయి పక్కనే మంచం కి అవతల అంచుకి అటు వైపు తిరిగి పడుకుని వుంది. తెల్లారీ తెల్లారగానే బొగ్గులు ఎత్తీయాల. గోని సంచీల్లో కుట్టీసి తుప్పల్లో దాసీయాల. లేక పోతే ఏ పారిస్టోడో , పాపిస్టోడో పారొస్తే మల్లా మొదులుకెల్తాది బేరం. తెల్లారి గట్ట బండేసుకొని ఎలిపొస్తానన్నాడు మేరంగి షావుకారి. నాలుగు బస్తాలుంచ మని వందరూపాయలు బయాన ఇచ్చేడు మొన్న సంతల కనపడి. ఆడిగ్గాని అనుకున్న బొగ్గులు ఇయ్యకపోతే ఊరిల మరుంచడు. ఈది మద్దిన 'బూంగ్ బాంగ్'సేసెత్తాడు...అని చుట్ట ఆర్పేడు.

ముసిలిదాయి ఇటు కదిలింది. "తిన్నాదో లేదో" అని పందిరి రాటకి వేలాడుతున్న ఉట్టిలోని దాకని వంచి చూసేడు. తిన్నట్టే వుంది. 'ఐనా తినడానికి ఇదేటైనా మెతుకు బువ్వలా?' వుట్టి కిందికి దించేడు. చెయ్యి దులుపుకుని దాకలో ముంచేడు. గెంజితో పాటు నూక బువ్వ చేతికి నిండా తగిలింది. ముసిలిదాయి తిన లేదని గ్రహించి లేపబోయేడు. చేయిముందుకు చాచి ఆగిపోయేడు. ముసిలిదాయి గురక పెడుతుంది. లేపినా తిడతాది గానీ తినదు. అదెప్పుడూ అంతే తిన్నానని ఇంత గెంజి తాగీసి మెతుకులన్నీ తన కోసమే వొదిలెస్తాది. "ఏమే?" అనడిగితే "నా తిండేమి తిండీ.. 'అపర...సపరే' అని ముసుగు తన్నేస్తాది లేక పోతే పనిలోకి ఎలిపోద్ది. 'ఈ బొగ్గుల దబ్బులొస్తే మిల్లు కెల్లి నూక బియ్యం కొనాల... ముసిలిదానికి కడుపు నిండా తినిపించాల' అనుకున్నాడు. గబ గబా తిండి ముగించి కుండలోని నీళ్లతో కడిగి బొగ్గుల బట్టీ మీద జల్లేడు. బట్టి చుట్టూ మరొక్క సారి తిరిగి కన్నాలన్నిటినీ ఒక్కొక్క దాన్నీ జాగ్రత్తగా పరిశీలించి మంచమ్మీద చేరబడ్డాడు.

తెల్లవారేసరికి మోటర్ సైకిల్ శబ్దం వినపడింది.అటువైపు చూసేడు, మేరంగి షావుకారి. బండి ఆపి, గోని బస్తాలు మడతలు విప్పుతూ బట్టీ కేసి నడిచి వొస్తూ కనిపించేడు. అప్పటికే ఐదు బస్తాల బొగ్గులు ఎత్తీసేడు. అవి షావుకారికిచ్చీయొచ్చని అనుకున్నాడు. కానీ షావుకారి ఒప్పుకోలేదు. ఎందుకంటే అతని చేతిలో వున్నవి పెద్ద బస్తాలు. తాను ఎత్తినవి చిన్నవని తగువు తీసేడు. ఎదురుచెప్పలేక ఒప్పుకున్నాడు. ఎందుకంటే వంద 'బయాన' ఇచ్చేడు. దానికి తోడు అతని తో తగువు పడితే తిరిగి పారిస్టోడికి అప్పజెప్పేస్తానని బెదిరించేడు కూడ ఒకసారి.

పారెస్టోడితో ఒక భయం.

షావుకారితో మరో రకం భయం.

భయమెంతున్నా బతకడం తప్పదు.

బతకాలంటే భయం వొదలదు. బతుకే భయం.

షావుకారి తన బస్తాలన్నీ నింపుకున్న తర్వాత బండి లోంచి రెండు సీసాలు తీసేడు. ముసిలోడి చేతిలో పెట్టేడు.

"తెల్లారి తెల్లారి ఒద్దు షాకారీ!" అని మొగమాట పడ్డాడు బూగన్న.

"అదేట్రా, నాకాడ సిగ్గెందుకురా!" అని బలవంత పెట్టేడు. సీసా చూసి ఆశ పడ్డాడు. బూగన్న పెదాలు తడుపుకున్నాడు. పని కాసేపు ఆపి పందిరికింద మంచమ్మీద కూర్చున్నాడు. సీసా మూత తీసి గటగటా రెండు గుక్కలు తాగేడు. సీసా రంగుదైనా సారామాత్రం తనకు తెలిసిందే. వంటదే. షావుకారి కేసి చూసేడు. షావుకారి నవ్వేడు. "దార్లోన నీకోసమని పట్టి తెచ్చేన్రా!" అని నవ్వేడు.

షావుకారి నవ్వు పూర్తయ్యేసరికి బూగన్న రెండు సీసాల్నీ ఖాళీ చేసేసేడు. అప్పుడు షావుకారి లెక్క చెప్పేడు. గతంలో ఇచ్చిన బయాన తో మొదలెట్టి, అప్పుడప్పుడూ సంత కొచ్చినపుడల్లా షాపులో తీసుకున్న పొగాకు కట్టలకీ,ఉప్పూ మిరపకాయలకీ ఎంతిచ్చేడో అన్నీ కలిపి లెక్క కట్టి "ఇదిగోరా బూగన్నా! నీకే..." అని జేబులో చెయ్యి పెట్టేడు షావుకారి.

షావుకారి మంచమ్మీద కూర్చొనీ, బూగన్న అతని కాళ్ల

# నగరీకరణ

❖ ఇంద్రగంటి నరసింహమూర్తి
9959352900

సూర్యుడస్తమించాడు
నగరం మేలుకొంది
నియాన్‌లైట్ల కాంతిలో మెరుస్తూ
పబ్బులను క్లబ్బులను స్వాగతిస్తోంది
బార్లు బార్లా తెరిచారు
మత్తుపానీయాలు ఉవ్వెత్తున ఎగసిపడుతున్నాయ్
సమాజం సహజత్వం కోల్పోయింది
నాగరీక నగరం మత్తులో జోగుతోంది
రియల్ ఎస్టేట్ పేరిట భూమి వ్యాపార వస్తువైంది
బహుళ అంతస్థుల భవనాల ప్రభావంతో
పంచభూతాలు పారిపోయాయి
కాలుష్యం పడగ విప్పి గరళం చిమ్ముతోంది
కార్పొరేట్ ఆసుపత్రులు కళకళలాడుతున్నాయి



అనారోగ్యంతో నగరం ఐసియులో పడకేసింది
టివికి మనసు అరువిచ్చి
కంప్యూటర్‌కు మెదడు తాకట్టు పెట్టి
నగరీకుడు... మనీమనీ అంటూ తపిస్తున్నాడు
షోరూములకు సంపాదనని ధారపోస్తున్నాడు
తోటి మనిషిని శత్రువుగా పరిగణిస్తున్నాడు
వాయిలెన్స్‌ని వరిస్తున్నాడు
అశాంతితో నగరం అలమటిస్తోంది
తన గొయ్యి తాను తవ్వుకోవడంలో
మానవుడే మొనగాడు
నగరీకరణ ముసుగులో
ఆత్మహత్యకు ఉరిత్రాడు పేనుకుంటున్నాడు ❖

---

దగ్గర మట్టిలో బొంతుకాలేసుకొనీ తలెత్తి రెండు కళ్లనీ దోసిళ్లు చేసి షావుకారి జేబువైపు చూస్తూ....

సూర్యోదయమయ్యేసరికి కొండకింద ఎప్పటికీ మారని ఆ దృశ్యం యధాతదంగా అక్కడ ఆవిష్కృతమైంది ఎప్పటిలాగానే.

బూగన్న మత్తు వదిలేసరికి అతని చేతిలో ఇరవై రూపాయల నోటు మిగిలింది. దూరంగా... దుమ్ము రేపుకుంటూ దూరమైపోతూన్న షావుకారి మోపెడ్ శబ్దం వినపడింది.

పొలం దారి దాటి.. రోడ్డు ... రోడ్డు దాటి ఊరు.. ఊరిలోని వీధులు... సందు గొందుల్లోంచి... బొగ్గుల బరువుతో బూగన్న. నడుస్తున్నాడే గానీ అతని నడక లోంచి సన్నగా వణుకు పుడుతోంది. అది భయం వల్ల వొచ్చింది కాదు. అంతదూరం నడిచి మోసుకొచ్చిన కావిడి బరువు వల్ల... వయసు భారం వల్ల. అతని వొళ్లు చెమట చెట్టైంది. ఒక్కొక్క చెమట చుక్కా నేల రాలి మొలకెత్తడానికి పదును పెట్టుకుంటున్నట్టు చల్లబడుతోంది నేల.

సూర్యుడు నడి నెత్తిన నిలబడి చూస్తున్నాడు. ఎర్రగా. ఎంత తిరిగినా తాననుకున్న రేటు రాకపోవడం. ఒంట్లోని రక్తం అంతా చెమట చుక్కలయి నేల రాలుతున్నట్టు ... నిస్సత్తువగా, నిర్జీవంగా. ఎంతో కొంతకి ఇచ్చేసాడు. కళ్లు బైర్లు కమ్ముతున్నట్టు... మసక మసకగా. చేతిలోని నోట్లు ఎంతో కూడా లెక్కబెట్టలేనంత బలహీనంగా.... అడుగులేస్తున్నాడు.

వీధుల్లోంచి బస్టాండు దాటి ఇంటి దారి పట్టబోతుండగా ఎవరో కుర్రాడు తన చేతిలోని నోట్లను లాక్కున్నాడు. తుళ్లి పడ్డాడు. ఎక్కడిలేని కోపంతో కళ్లెర్రగించి వాడి కాలర్ పట్టుకున్నాడు.

వాడు....

తాగి వున్నాడు.

జీను ఫేంటు తో జారిపోయిన ఇన్ షర్టు చేసుకొని వున్నాడు. చేతిలో మాసిపోయిన గుడ్డ సంచీ వుంది.

పిడికిలి మరింత బిగించి కళ్లు చిట్లించి చూసేడు బూగన్న.

వాడు.... ఇల్లొదిలి పనుల కోసం వలసెల్లిపోయిన కన్న కొడుకు నాగన్న. కూలి పనులకెల్లి రెండు డబ్బులు సంపాదించి ఇంటికొస్తాడని ఆశపడిన కొడుకు ఇలా ఎదురయ్యేడు. బూగన్నకి ఏమి చెయ్యాలో తెలీలేదు.

“సరిపోతాయో లేదో ఇంకా... సెల్లు లేక టౌనులోన తిరగనేక పోతున్నాము. తలెత్త లేకుంటున్నాము” అని తూలుతూ తండ్రి చేతిని విసురుగా విడిపించుకొని ఏదో గొణుక్కుంటూ ఇంటి వైపు వేగంగా అడుగులేస్తూన్న కొడుకు లీలగా అస్పష్టంగా అలికినట్టు కనిపించేడు బూగన్న కంటికి. వాడిని అందుకొని వాదనకు దిగే శక్తి,ఓపికా బూగన్నకి లేవు. నిశ్శత్తువగా కూలబడిపోయేడు.

బూగన్న కి ఆ మాటలూ వినపడలేదు. విన్నా అర్థం చేసుకోలేదు.

అర్థమయ్యింది ఒక్కటే... తానెంత కష్టపడుతున్నా ఫలితాన్నెవరో ఒకరు లాక్కుపోతున్నారని. తనకు మాత్రం మిగిలేది బుగ్గేనని.

❖

# వ్లదీమిర్ మయకోవ్‌స్కి : జీవితం ❖ కవిత్వం

❖డా॥ తక్కోలు మాచిరెడ్డి
9666626546



***1893 జూలై 19వ తేదీన జార్జియాలోని బగ్దాది అనే గ్రామంలో జన్మించిన వ్లదీమిర్ మయకోవ్‌స్కికి తన 12 ఏటనే సోదరి లూద్మిలా తెచ్చి ఇచ్చే విప్లవ సాహిత్యంతో పరిచయం ఏర్పడింది. ఉన్నత పాఠశాలలో చదువుతున్నపుడే మార్క్సువాద అధ్యయనం కేంద్రంలో చేరాడు. 1906లో కుటుంబం మకాము మాస్కోకు మారింది. మయకోవ్‌స్కి 1908లో బోల్షివిక్ పార్టీతో సంబంధం పెట్టుకున్నాడు. కార్మికుల్లో భావజాల ప్రచారం చేస్తాడు. ఫీజు చెల్లించనందున పాఠశాల నుంచి ఉద్వాసన, అదే సంవత్సరం (1908) రహస్యంగా ముద్రణాయంత్రం నడుపుతున్నాడని అరెస్టు జరుగుతాయి.***

మయకోవ్‌స్కి అసలైన అర్థంలో 'ప్రొలితేరియన్ (కొల్లగొట్టబడేవారి) కవి, అని అంటాడు ప్రముఖ రాజనీతిజ్ఞుడు, సాహితీవేత్త ఎ.వి.లున్‌చార్‌స్కి. *(ఎ.వి.లున్‌చార్‌స్కి ఆన్ లిటరేచర్ అండ్ ఆర్ట్స్ & ప్రగతి ప్రచురణాలయం, మాస్కో)*

మరో రష్యన్ సాహితీ విమర్శకుడు అలెక్సీ మెత్‌చెంకీ మయకోవ్‌స్కిని గురించి రాస్తూ "లక్షలాది జనం దృష్టిలో కవిత్వ ప్రభావాన్ని ద్విగుణీకృతం చేయడంలో. 20 వ శతాబ్దంలో మయకోవ్‌స్కికి మించినవారు లేరు" అని ధీమాగా చెబుతాడు. *(వ్లదీమిర్ మయకోవ్‌స్కి, ఇన్నోవేటర్ - ప్రగతి ప్రచురణాలయం - మాస్కో)*

కవిత్వానికి సంబంధించి మయకోవ్‌స్కిని రష్యను శ్రీశ్రీ అనవచ్చు. వాగ్ధాటిలో అతన్ని గజ్జెల మల్లారెడ్డితో పోల్చవచ్చు. అటువంటి విప్లవ కవి జీవితాన్నీ, కవిత్వాన్నీ కాస్త పరామర్శిద్దాం.

1893 జూలై 19వ తేదీన జార్జియాలోని బగ్దాది అనే గ్రామంలో జన్మించిన వ్లదీమిర్ మయకోవ్‌స్కికి తన 12 ఏటనే సోదరి లూద్మిలా తెచ్చి ఇచ్చే విప్లవ సాహిత్యంతో పరిచయం ఏర్పడింది. ఉన్నత పాఠశాలలో చదువుతున్నపుడే మార్క్సువాద అధ్యయనం కేంద్రంలో చేరాడు. 1906లో కుటుంబం మకాము మాస్కోకు మారింది. మయకోవ్‌స్కి 1908లో బోల్షివిక్ పార్టీతో సంబంధం పెట్టుకున్నాడు. కార్మికుల్లో భావజాల ప్రచారం చేస్తాడు. ఫీజు చెల్లించనందున పాఠశాల నుంచి ఉద్వాసన, అదే సంవత్సరం (1908) రహస్యంగా ముద్రణాయంత్రం నడుపుతున్నాడని అరెస్టు జరుగుతాయి. 1908లోనే స్ట్రగనోవ్ అప్లైడ్ ఆర్ట్ కళాశాలలో చేరతాడు. 1909లో రెండుసార్లు అరెస్టు అయినాడు. అతని కవితల్ని జార్ నిరంకుశ ప్రభుత్వం నిషేధించింది.

1910లో పార్టీ పని వదిలి అధ్యయనం ముమ్మరం చేస్తాడు. నేను సమాజవాద కళను కోరతాను.' అని ప్రకటిస్తాడు. మరుసటి సంవత్సరం వయకోవ్‌స్కి చిత్రకళ, స్థాపత్యకళ కాలేజీలో చేరాడు. 1913లో మొదటి కవితా సంపుటి వెలువరించారు. ఆ సంవత్సరమే డిసెంబరులో 'మయకోవ్‌స్కి' అనే శీర్షికన తాను రాసిన విషాదాంతాన్ని పీటర్స్‌బర్గ్‌లో ప్రదర్శించారు. అందులో మయకోవ్‌స్కియే ప్రధాన పాత్రధారి.

1914లో భవిష్యవాద కార్యకలాపాలకు గాను కాలేజీ నుంచి అతనిని బహిష్కరించారు. 1916 మార్చిలో అప్పటి తాత్కాలిక ప్రభుత్వం దేశ సాంస్కృతిక రంగాన్ని తన అధీనంలోకి తెచ్చుకునే ప్రయత్నాన్ని నిరసిస్తూ ప్రదర్శనలో పాల్గొన్నాడు మయకోవ్‌స్కి.

**1924లో మాస్కోలో సామ్యవాద పార్టీ కార్యాలయంలోని 'రెడ్‌హాల్' లో మయకోవ్‌స్కి ఈ 'లెనిన్' కావ్యాన్ని సొంతం పఠించాడు.**

1917 జూన్‌లో 'నొవాయ జీజ్న్' (నవజీవనం) అనే పత్రికలో 'విప్లవం' అనే మయకోవ్‌స్కి కవిత ప్రచురితమైంది.

1917 నవంబరు 7వ తేదీన జరిగిన అక్టోబర్ మహావిప్లవం మయకోవ్‌స్కిని కూడా కదిలించింది. ఈ సంఘటననుసరించి రాస్తూ మయకోవ్‌స్కి 'విప్లవాన్ని ఆహ్వానించడమా, లేక దాన్ని తిరస్కరించడమా - అనే ప్రశ్న నా మదిలో తలెత్తలేదు' అని నిర్ద్వంద్వంగా ప్రకటించాడు.

1918లో 'నేను డబ్బుకోసం పుట్టలేదు లాంటి కొన్ని సినిమాలకు సన్నివేశాలు సమకూర్చాడు. 1919లో "ROSTA" అనే 'రష్యా టెలిగ్రాఫ్ ఏజెన్సీ' కోసం వ్యంగ్య కార్టూనులు రాసి ఇచ్చాడు. 1922లో మయకోవ్‌స్కి రాసిన 'సమావేశాల మోజురాయుళ్లు' అనే కవితను లెనిన్ మెచ్చుకున్నాడు. 1923లో లెనిన్ జబ్బు పడినప్పుడు రాసిన కవిత 'మేం విశ్వసించం' అనే శీర్షికతో రాసిన ఈ కవితా శీర్షిక మార్చి 'వ్లదిమీర్ ఇల్యీచ్ లెనిన్' అనే కొత్త శీర్షికతో అచ్చు వేశారు. 1924లో మాస్కోలో సామ్యవాద పార్టీ కార్యాలయంలోని 'రెడ్‌హాల్'లో మయకోవ్‌స్కి ఈ 'లెనిన్' కావ్యాన్ని సొంతం పఠించాడు. సామ్యవాదుల కోసం. మరుసటి సంవత్సరం సామ్యవాద పార్టీకి చెందిన సాహితీ సమితి ఆధ్వర్యాన 'సృజనాత్మక సాహిత్యం ఎలా వుండాలి?' అనే శీర్షికన జరిగిన చర్చాగోష్ఠి కార్యక్రమంలో మయకోవ్‌స్కి పాల్గొన్నాడు.

వేర్వేరు సమయాల్లో మయకోవ్‌స్కి పలు దేశాలు సందర్శించాడు. అనేక స్వీయ కవితలు విన్పించాడు. ఆయన పర్యటించిన దేశాలు : జర్మనీ, ఫ్రాన్సు, పోలెండు, చెకొస్లోవేకియా, అమెరికా సంయుక్త రాష్ట్రాలు మొదలగునవి. ఇక స్వదేశంలో అనేక చోట్ల స్వీయ కవితాగానం చేశాడు. జనాన్ని ఉర్రూతలూగించాడు. ఒదెస్సా, సెవాస్తపోల్, యాల్టా, పీటర్స్‌బర్గ్, కిటన్, ద్నిప్రొపెత్రోవ్‌స్కి, క్రాస్నదొర్ లాంటి అనేక పట్టణాలలో తన కవితల్ని విన్పించాడు. విజయవంతంగా. 1927లో పారిస్, ప్రాహ, బెర్లిన్, వార్సా వంటి నగరాలలో పర్యటించి తన పర్యటనానుభవాలను రేఖాచిత్రాలుగా మలచినాడు. పారిస్‌లో ఫ్రెంచి కవి లూయీ ఆరగాన్‌ను కలిశాడు. 1930 ఫిబ్రవరిలో RAAP (ప్రొలితేరియన్ రచయితల అఖిల రష్యా సంఘం)లో చేరాడు. అంతకుముందు మాస్కో ప్రొలితేరియన్ రచయితల సంఘంలో వుండినాడు. 1930 ఏప్రిల్ 14న తేదీన ఉదయం 10 గం॥ 15 నిమిషాలకు మాస్కోలోని లుబ్యాన్స్కి వీధిలో వుండే తన అధ్యయన గదిలో మయకోవ్‌స్కి రివాల్వర్‌తో కాల్చుకుని ప్రాణం విడిచాడు. అతని అంతిమయాత్రలో దాదాపు లక్షాయాభై వేలమంది ముఖ్యంగా కార్మికులు వరుసగా నిలబడి అతని పార్థివ శరీరాన్ని దర్శించుకొని శవపేటిక వెంబడి నడిచారు. 37 సంవత్సరాలే జీవించిన ఈ విప్లవకవి కవిత్వం అమరం.

మరి ఇపుడు మయకోవ్‌స్కి కవితా ప్రస్థానాన్ని పరామర్శిద్దాం.

1912లో మయకోవ్‌స్కి తన మొదటి కవిత 'ఆ రాత్రి' రాశాడు. 1917 విప్లవానికి పూర్వం భవిష్యవాదం ప్రభావం కన్పిస్తుంది అతనిపై. భవిష్యవాద ప్రభావంతో రాసే కవిత్వం లక్ష్యం క్రియలతో ప్రయోగం, ప్రయోగం కోసమే ప్రయోగం. ఇదీ భవిష్యవాద సారాంశం. రూపమే ప్రధానం. వస్తువు కాదు. అందులో సామాజిక లక్ష్యాలు వుండవు. సామాజిక సమస్యల్ని పట్టించుకోరు. కాని, మయకోవ్‌స్కి మానవీయ విలువకు స్థానమిచ్చాడు. అవి భవిష్యవాదాన్ని సమర్థించవు. సమకాలీన వాస్తవికతను ఒక విషాదాంతంగా వర్ణిస్తూ 1913లో 'వ్లదిమీర్ మయకోవ్‌స్కి' కవిత రాశాడు తన పేరుతోనే. ఇందులో తననే ఒక విషాదాత్మక వ్యక్తిగా చిత్రించుకుంటాడు. అందరూ దు:ఖితులే. ప్రజలకు మేలు చేయాలని ఆశిస్తాడు. కాని ప్రపంచం 'సంతోషం' అనే మాటే మరచిపోయింది. మానవత్వం పూర్తిగా కోల్పోయినవారే కవికి కన్పిస్తారు.

మారియ అనే అమ్మాయితో ప్రేమలో పడిన మయకోవ్‌స్కికి నిజంగానే నిరాశే ఎదురైంది. ప్రేయసి తనను ప్రేమించడం లేదు. "నేను వేరే పెళ్లి చేసుకుంటున్నాను" అని తెగేసి చెబుతుంది ఆ ప్రేయసి. తన ప్రేమను ఒక సరికొత్త తాజా భావచిత్రంతో ఇలా వర్ణిస్తాడు కవి. 'ప్యాంట్స్‌లో మేఘం' అనే ఈ కవితలో.

**మారియ, నేను నిన్ను ప్రేమిస్తున్నాను -/ యుద్ధంలో ఒక కాలు తెగిన/ సైనికుడు / తన రెండో కాలును/ ఎంత ముద్దుగా చూసుకుంటాడో/ అంత ముద్దుగా / నిన్ను నేను చూసుకుంటాను**

కాని, మయకోవ్‌స్కి ప్రేమ విశాలమయింది. తన విశాల దృక్పథాన్ని 'క్రిస్‌మస్‌కు ఒక రోజుముందు' అనే కవితలో వ్యక్తం చేస్తాడు. అమ్మను సంబోధిస్తూ

***నిన్ను గురించే కాదమ్మా/ప్రపంచమంతా కూరుకుపోయింది/కుటుంబ వ్యవహారాల్లో/కుటుంబానికి అంత విలువా? వద్దు -/నా కుటుంబమా! అసలు నాకు ఏ కుటుంబమూ లేదు.../ఈ ప్రేమ రహిత ప్రపంచమంతా/ సంతోషంగా వుండాలనే నా తపన అంతా..*** అని నిక్కచ్చిగా చెబుతాడు.. వ్యక్తి వాదానికి దూరంగా..

ఈ సందర్భంగా 1916లో రాసిన ఒక ప్రేమకవితను ప్రస్తావించాలి.

జాబుకు బదులుగా ఒక గేయకవిత రాశాడు కవి. లిలీ అనే ఆమె పేరులోనే ఓ మెరుపు ఉంది అని ప్రశంసిస్తాడు.

***ప్రపంచంలోని మరేదీ అంత / ఆనందాన్నివ్వదు నాకు/ ఒక్క నీ చూపుతప్ప / ఉరితాడు గానీ / ఉప్పొంగిన నదీ ప్రవాహం గానీ, / తుపాకి తూటాగానీ / ఏ విషమూ గానీ/నన్ను చంపలేవు ../నన్ను అధీనంలోకి తీసుకున్న / ఒక్క నీ చూపు తప్ప..***

బూర్జువా వ్యక్తుల్నీ, శక్తుల్నీ నిరసించాడు మయకోవ్‌స్కి. 'మీకోసం' అనే కవితలో వారిని స్పష్టంగా నిందించాడు. ఇలా..

***స్త్రీల దేహాలనూ, విందులనూ, కార్లనూ / ప్రేమించే మీ కోసం / ప్రాణాలు అర్పించే కంటే, / వెళ్లి, మాస్కో బార్లలో వుండే / వేశ్యలకు పండ్లరసం ఇవ్వడం / ఎంతో మేలు***

విప్లవ పూర్వపు నగర జీవితాన్ని ఒక్క వాక్యంలో ఇలా వర్ణిస్తాడు.

***నగరం ఒక పెద్ద నరకం/ ఎర్రదయ్యాల్లా కార్లు పెద్దగా అరుస్తూ పోతున్నాయి..*** 'ఎర్ర దయ్యాల్లా' ఎంత సముచితమైన భావచిత్రం!

బూర్జువా సమాజంలో డబ్బు గచ్చు కంపు కొడుతూంటుంది. అంతా వాణిజ్యమే, వ్యాపారమే. కవి మాటల్లో...

ప్రతి ఒక్కరికీ ప్రేమ అందుబాటులో వుంటుందని నే భావించా, కానీ వ్యాపారం,

**ఆదాయం లెక్కల్లో / పడిన వాళ్ల గుండెల్లో**
**బంకమట్టితో గడ్డకట్టిన ఆ గుండెల్లో**
**ప్రేమ మొలకెత్తదు / మొలకెత్తదు ప్రేమ**

అని కవి వాపోతాడు.

1914-17 మధ్య కాలంలో మయకోవ్‌స్కి అనేక కవితలు రాశాడు అన్యాయ సమాజాన్ని, అణచివేతల సమాజాన్ని తన కవితల్లో వ్యక్తం చేస్తూ, నిరసిస్తూ.

మయకోవ్‌స్కి స్పందనశీలి. పెరూదేశపు న్యాయమూర్తుల గురించి అతను రాసిన కవిత ఇందుకో నిదర్శనం. నృత్యాలకూ, రకరకాల పక్షులకూ, ప్రేమలకూ నిలయమైన పెరూ దేశపు న్యాయమూర్తులను సంబోధిస్తూ ఓ కవిత రాశాడు. కొన్ని పంక్తులు :

***భూ మండలంలో పెరిగిన ఓ పూలచెట్టు పెరూ../ ఏమయిందో ఏమో, మరి/కొందరు న్యాయమూర్తులు పెరూ దేశాన్ని / పాడు చేశారు, కొల్లగొట్టారు; / పక్షుల రెక్కల ఈకల్ని పెరికి పారేశాడు / నెమళ్లన్నీ పారిపోయాయి / నా కవితల్ని అక్కడ నిషేధించారు / ఎందుకో మరి తెలుసా? / నా కవిత్వం సారాయి కంటే హానికరమట! / ప్రజారహిత, పక్షిరహిత పెరూను చూసి / నే జాలి పడతాను, మరి***

***మీరు?***

అని ప్రశ్నిస్తాడు. తన స్పందనను పంచుకోమంటాడు.

1917 అక్టోబరు విప్లవానికి ముందు రాసిన కవితల్లో భవిష్యత్తును సూచిస్తాడు కవి. 'ప్రజలు వస్తారు' , అసలైన జనం / భగవంతుని కంటే మిన్నగా, మానవీయంగా' వుండే ప్రజలు వస్తారని పేర్కొంటాడు.

కాని, విప్లవానికి పూర్వమే ప్రపంచయుద్ధం వచ్చింది. 'యుద్ధమూ-శాంతి' అనే శీర్షికతో మయకోవ్‌స్కి ఓ సుదీర్ఘ కవిత రాశాడు. 'జవాబు చెప్పండి' అనే మరో కవిత కూడా యుద్ధాన్ని నిరసిస్తూ రాసిందే.

1916లో 'యుద్ధమూశాంతి' కవిత రాశాడు. యుద్ధ బీభత్సాన్ని వర్ణిస్తూ రాస్తాడు. :

***నే వెడుతున్నా / దేవుని దగ్గరికి/ రైఫిల్‌తో / అప్పరసలు వణికిపోతున్నారు/ ఎక్కడున్నారు దేవతలంతా/ పరుగులు తీశారు / భయాందోళనతో/ బుద్ధులూ, / అల్లాలూ/ యెహోవాలు/ దేవుళ్లందరూ / మాయమైనారు/ ప్రపంచయుద్ధం ప్రారంభమై ఐదవ రోజు/ ఓ రైలుబండిలో / ఓ కంపుగొడుతున్న బోగీలో నలభై మంది శవాలు దాంట్లో -***

***కాని నాలుగు కాళ్లే / వాళ్లందరినీ కలిసి / యుద్ధ పర్యవసానం ఇది.***

జవాబివ్వండి !" అనే కవితలో యుద్ధ నిరర్థకతను బలంగా వెల్లడిస్తాడు. ఇలా..

***ఎందుకు ఈ యుద్ధం?/ స్వాతంత్ర్యం కోసమా? / దేవుని కోసమా?/ లేక నగదు కోసమా?/ నీవెప్పుడు మేల్కొనేది?/ నడుం బిగించి, శక్తివంతంగా / యుద్ధోన్మాదుల నెదిరిస్తూ../ వారి మొహం మీద / ప్రశ్నల వర్షం కురిపించేది?/ ఎందుకు మనం యుద్ధం చేసేది?/ ఎందుకు? ఎందుకు?/ అని ప్రశ్నించేది./ ఎప్పుడు?***

విప్లవం - సమాజవాద విప్లవం రానే వచ్చింది. అక్టోబరు (నవంబర్ 7) మహా విప్లవం. 1918తో వసంత రుతువులో 'విప్లవగీతి' రాశాడు. మయకోవ్‌స్కి విప్లవాత్మక ఆశావాదం కొట్టొచ్చినట్లు కన్పించేది అప్పటి కవితల్లో. తిరోగామి కవులు, రచయితలు మయకోవ్‌స్కిని గేలి చేసేవారు. 'నా విప్లవం' అంటూ మయుకోవస్కి 'దీన్ని ఆమోదించడమా లేక తిరస్కరించడమా అనే ప్రశ్నే నా మదిలో తలెత్తలేదు' అని నిర్ద్వంద్వంగా అక్టోబరు విప్లవాన్ని ఆహ్వానించాడు.

విప్లవం (నవంబరు 7, 1917) తర్వాత అన్ని ముఖ్యమైన మలుపుల్లో సామ్యవాద పార్టీ పంథాకి అనుగుణంగానే నడిచాడు ; కవితలు, నాటకాలు, సినీ సన్నివేశాలు, ప్రకటనలూ రాశాడు. అన్నింటికంటే మించి, స్వీయ కవితాగానం చేసేవాడు దేశంలో, విదేశాల్లో. పార్టీ పట్ల పూర్తి నిబద్ధత తన కవితారచనకు అడ్డంకి కాదని నిరూపించాడు. అతను రాసిన 'సమావేశాల పిచ్చి' అనే వ్యంగ్య కవితను లెనిన్ చాలా మెచ్చుకున్నాడు.

సమాజవాద ప్రభుత ఏర్పడిన తర్వాత కూడా మయకోవ్‌స్కి ప్రభుత్వంలోని ఉద్యోగి స్వామ్యాన్ని (బ్యూరోక్రసీ) ఆగ్రహిస్తూ రాశాడు. అంటే ఈ విధంగా, సమాజవాద వాస్తవికతా వాదమే కాకుండా, సవిమర్శక సమాజవాద వాస్తవికతావాదానికి నాంది పలికాడు. దీనికి ఎంతో గుండెధైర్యం అవసరం. సమాజవాద సమాజంలో కూడా లోపాల్ని ఎత్తిచూపించడం సాహసమే. దీన్ని లెనిన్ లాంటి నేతలు మెచ్చుకోవడం ముదావహం.

***'పేపర్ల అఘాయిత్యాలు' అనే కవితలో పనికిరాని ప్రతి పేపరునూ / ద్వేషించాలి కార్మికులు / వాటిని శత్రువులుగా చూడాలి / నరకాన్ని నిరసించినట్లు వాటిని, అని అంటాడు. ఎందుకంటే, కవి మాటల్లో చెప్పాలంటే, 'ఆదేశాలు మస్తిష్కాలను బహిష్కరిస్తాయి.'***

మయకోవ్‌స్కి మంచి దేశభక్తుడు. దేశభక్తికీ విశ్వజనీన మానవతావాదానికీ మధ్య వైరుధ్యం లేదని అతని కవితలు వ్యక్తం చేస్తాయి. 'సోవియట్ పాస్‌పోర్టు' అనే కవితలో తాను ఓ సోవియట్ పౌరుడినని గర్వంగా ప్రకటిస్తాడు.

బ్రిటిషు పాస్‌పోర్టులు, అమెరికా సంయుక్త రాష్ట్రాల పాస్‌పోర్టులు, స్వీడిష్ పాస్‌పోర్టులు, తొందరగా చూసేసి, ఆలస్యం లేకుండా పర్యటనకు అధికారులు అనుమతిస్తారు. కానీ, సోవియట్ పాస్‌పోర్టును చూసి దాన్ని ఒక బాంబుగానో, రెక్కలు తెగిన తేనెటీగలు గానో, లేక ఒక త్రాచుపాముగానో చూస్తారు అధికారులు. సుత్తి, కొడవలి గుర్తు ఉన్న మయకోవ్‌స్కి పాస్‌పోర్టు చూసి, అతనిని శిలువ వేయనున్నట్లు కన్పిస్తారు అధికారులు. కాని, ఆ సోవియట్ పాస్‌పోర్టు అన్ని సర్టిఫికెట్ల కంటె మిన్న అనీ, మీరు ఇది చూసి నా పట్ల అసూయ చూపాలని అంటారు మయకోవ్‌స్కి.

చాలా దేశాలతో పాటు మయకోవ్‌స్కి అమెరికా సంయుక్త రాష్ట్రాలు సందర్శించాడు. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని కొన్ని కవితలు రాశాడు. 'అట్లాంటిక్ మహాసముద్రం' అనే కవితలో 'నీగ్రోలను హతమార్చడం నాగరికత అంటారు. కొందరు / ఇతరులు దీన్ని 'వలసీకరణ' అంటున్నారు.' అని 1925లోనే అన్నాడు. 'బ్రూక్లిన్ వంతెన' అనే మరో కవితలో మరీ స్పష్టంగా రాశాడు. ఇలా కొందరికిక్కడ / అంతా వినోదాత్మకం చాలా మందికేమో ఆకలి కేకలు' అంటూ. ఆకాశ హర్మ్యాలున్న అమెరికా సమాజాన్ని ఉద్దేశించి ఆ సమాజాన్ని 'డిసెక్ట్' చేస్తూ ఒక కవిత రాశాడు మయకోవ్‌స్కి. ఏ అంతస్తులో ఏమి జరుగుతుందో విశదీకరించాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాల్ని అస్యహించుకునేట్లు చేస్తాయి. ఈ కవితా పంక్తులు, చిత్ర విచిత్ర దృశ్యాల్ని, అసభ్య సమాజాన్ని వ్యక్తం చేస్తూ సాగుతుందీ కవిత.

సూర్యుడూ, నక్షత్రాలు లాంటి అంతరిక్ష చిత్రాలు కొన్ని కవితల్లో కన్పిస్తాయి. ఒక చోట కవి అంటారు-

***సూర్యుడూ, నేనూ/ ఇద్దరమూ అంటున్నాము / ప్రకాశించు ప్రకాశించు/జీవనం ఉన్నంతవరకూ/ ప్రకాశించూ, అని***

'బాగుంది' అనే కవితలో విప్లవానంతర నిర్మాణ దశ వ్యక్తమయింది. జీవితమిపుడు అద్భుతం అనీ, సుందరం అనీ అభిప్రాయపడతాడు మయకోవ్‌స్కి.

ఫాసిస్టు ముస్సోలినీని నిరసిస్తూ 1926లో ఒక కవితలో మయకోవ్‌స్కి అంటాడు.

***నీ భుజస్కందాలు ఎలా వున్నాయి?/ ముందు, రోమన్ ఫాసిస్టుల మీద/ దెబ్బకొట్టు***

తన పార్టీ నిబద్ధతను మయకోవ్‌స్కి కొన్ని కవితల్లో అభివ్యక్తం చేశాడు. ఒక కవితలో అంటాడు :

**నాకు తెలుసు**

***ఎర్రజెండా / కిందనే / దానికోసమే/ సర్వస్వం అర్పించిన వారితో/ కలిసి ఉండడానికి / నేను అర్హుణ్నని / తెలుసు*** అని చెప్పుకుంటాడు.

తాను చనిపోయినా, మిగతా సహచరుల చెంతనే తనస్థానం అని అలా స్పందిస్తాడు ప్రజాకవి మయకోవ్‌స్కి.

ఇవన్నీ ఒక ఎత్తు. లెనిన్‌పై ఆయన రాసిన సుదీర్ఘ కవిత మరొక ఎత్తు. ఆ కావ్యాన్ని ఆంగ్లం నుంచి (రష్యను నుంచి కాదు) తెలుగులోకి శ్రీశ్రీ అనువాదం చేశారు. అనువాదం కాదది, అనుసృజన అనుకోవచ్చు.

***ఇదే అదను లెనిన్ కథను/ రచించెదను నేను,/ లెనిన్ బ్రతుకు / జనం కొరకు..*** మూలం (రష్యను మూలం) కంటే ఈ అనువాదం బాగుంది. అనువాద ఆరంభ పంక్తులవి.

లెనిన్ జనంలో వున్నాడంటాడు. ఇప్పటికీ అది సత్యమే. మయకోవ్‌స్కీ మాటల్లో లెనిన్ నేడు రాలేదూ? చూడు జనంలో ఉన్నాడు. లెనిన్‌ను గురించి రాసేటంత అర్హత తనకు లేదంటాడు మయకోవ్‌స్కి.

***లెనిన్ నా కనుపాప?/ క్షుద్ర కావ్యంతో అవమానిస్తానా?***

***మానవత్వం మూర్తీభవించిన మహానుభావుడు లెనిన్*** అంటాడు.

చరిత్రను గురించిన మార్క్సువాద భావనను కవిత్వీకరిస్తాడు.

ఎలా సామంతవాదం (ఫ్యూడలిజం) వేళ్లూనుకొన్నదీ, క్రమేణా వెనుకబడిన రష్యాలో కూడా సమాజవిప్లవం రావచ్చునని లెనిన్ దృఢవిశ్వాసం. ఈ విధానాన్ని చేపట్టే విప్లవాన్ని విజయవంతం అయ్యేట్లు చేశాడు. ఇది ప్రొలితేరియత్ విజయం కార్ల్ మార్క్సును గురించి రాస్తూ మయకోవ్‌స్కి అంటాడు:

***కార్ల్‌మార్క్సు / లెనిన్ పెద్దన్నయ్య/ప్రతి ఫ్యాక్టరీలో తానే / పనిచేసినట్లూ/ప్రతి పనిముట్టుతో తన చేతువేలు/ కాయలు కాచినట్లు!/ఇంకా,/అదనపు విలువల కన్నపు దొంగల్ని/ కన్నంలోనే పట్టుకున్నారు మార్క్సు..*** కార్మికవర్గాన్ని వర్గ పోరాటాల్లోకి నడిపించాడు. కార్ల్‌మార్క్సు.

ఈ పోరాటానికి మార్క్సు పుస్తకాలు ఎంతో దోహదం చేశాయి అని అంటూ కవితలో ఇలా చెప్తాడు మయకోవ్‌స్కి

***మార్క్సు పుస్తకాలు / అచ్చొత్తిన కాగితాలు కావు/ అంకెలు కావు లెక్కలు కావు / బూజుపట్టిన కవితె కట్టలు కావు,***

***దారి తెలియని కష్టజీవులకు / క్రమశిక్షణ నేర్పిన గ్రంథాలవి..***

పారిస్ కమ్యూన్ నుంచి గుణపాఠం నేర్చుకొని లెనిన్ ఎలాగా రష్యా కార్మికుల్ని విప్లవీకరించాడో విశదీకరించాడు ఈ కావ్యంలో మయకోవ్‌స్కి వ్యక్తివాదం పనికిరాదంటూ, సమిష్టివాదం, పార్టీ, ప్రాధాన సాధనాలు విప్లవానికి అని నిష్కర్షగా తెలుపుతాడు. పార్టీ అంటే అంటే అర్థం -

***శతసహస్ర బాహువులు / మస్తిష్కాలు / నేత్రాలు***

***ఒకటిగా పెనవేసుకుని / ఒకటిగా పని చేసేవి.***

అని పార్టీని నిర్వచిస్తాడు. పార్టీ అంటే కార్మికులకు ఎలాంటిదో ఒక ఉపమానం ద్వారా స్పష్టం చేస్తాడు ఇలా..

***సముద్రంలో మా నౌకను/సరిగా నడిపించే దిక్సూచి పార్టీ/ సమస్త కార్మిక వర్గానికీ వెన్నెముక.***

కార్మికులు, కర్షకులు కలిపి విప్లవం సాధిస్తారని లెనిన్ విశ్వాసం. రష్యాలో కూడా కార్మికవర్గం ఉంది. సంఖ్యలో పెద్దది కాకపోయినా, వన్నెకెక్కిన, సిద్ధాంత శస్త్రధారులై, విచక్షణతో కూడిన కార్మిక వర్గం- (బోల్షివిక్ పార్టీ సారధ్యంలో) విప్లవించింది. 1905 విప్లవం విఫలమైంది. 1917 నవంబరు 7న సమాజవాద విప్లవం విజయశంఖారావం చేసింది. వ్లదీమిర్ ఇల్యాచ్ లెనిన్ మార్గదర్శకత్వంలో దీన్నంతా కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు మయకోవ్‌స్కి.

ఏ.వి.లున్‌చార్‌స్కి అన్నట్లు, మయకోవ్‌స్కికి పదాలంటే భలే ఇష్టం. పడి చస్తాడు. పదాలను అతను ఆదేశిస్తాడు. ఆ ఆదేశాలను సైన్యంలాగ శిరసావహిస్తాయి ఆ పదాలు. నూతన పదబంధాలెన్నో మయకోవ్‌స్కి అందించాడు. రష్యను భాషకు ఎంతో దోహదం చేశాడు.

సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమయినా, విప్లవజ్యోతి వెలుగుతూనే ఉంది. క్యూబా, వియత్‌నామ్, జనచైనా దేశాల్లో సామ్యవాద పార్టీలు పాలక పార్టీలుగా ఉన్నాయి. దక్షిణ అమెరికా ఖండంలోని అనేక దేశాల్లో సమాజవాదోన్ముఖ పార్టీలు అధికారం చేపట్టాయి. అంతేకాదు, అభివృద్ధి చెందుతున్న దేశదేశాల్లో జనం ప్రేరణ పొందుతున్నారు. మయకోవ్‌స్కి రచనలతో లేదా మయకోవ్‌స్కి ప్రభావంతో రచనలు చేస్తున్న కవులతో.

ప్రపంచంలోని పలు భాషల్లోకి మయకోవ్‌స్కి కవిత్వం అనువాదాల ద్వారా చేరింది.

విప్లవకవులకు మరణం లేదు.

విప్లవ కవి వ్లదీమిర్ మయకోవ్‌స్కి అమరజీవిగా మారిన ప్రపంచ పరిస్థితుల్లో కూడాను.



## కవిత

# మనో విశ్వరూపం

❖ వల్లభాపురం జనార్దన
9440163687

మనసు ఒక అగాధం
హిమాలయ శిఖరం
సమతల మైదానం
పరవళ్ళు తొక్కుతూ పారేనది
దూకే జలపాతం
లోతుల్లోంచి పైకుబికే భూగర్భజలం
ఆధ్యాత్మిక భ్రమ స్వరూపం కాదు
పదార్థ పరిణామ రసాయన ప్రయోగం
ఊహల హరివిల్లు
భావాల మహాభారతం
శంబూకుని హత్యనూ ఆరాధిస్తుంది
హేతువాదానికి జేజేలు పలుకుతుంది
నియంతృత్వానికి ఎర్రతివాచీ పరుస్తుంది
ప్రజాస్వామ్యానికి పహారా కాస్తుంది
శ్రీకృష్ణుని విశ్వరూపం కల్పితం
ఇది అనుభవాల ఆకారాలు
మహావిశ్వరూపం
మనసు విశ్వరూపం వాస్తవం
మనసు ఒక ఆవేశ భూకంపం
బాధాతప్త పర్వత లావా
ఒక శాంత మహా సముద్రం
మనసు రోగాల పాలుకాకుంటే
మానవత్వానికి పట్టాభిషేకం



# సింగపూర్ పార్కులో

❖ కొమురవెల్లి అంజయ్య
998511090



నట్టనడుమ నాభిలా త్యాగదుని చెరువు
పాల ఊటల్ని చెట్లకు తాపుతున్న తనువు
ఎండ వడిలో మెరుపు సుమాలతో చనువు
మరో పక్క ఆగిన గడియారంలా కాలువ
వాన ఆలింగనంలోనే జడత్వం వీడే కలువ
మధ్యలో పవళించిన పచ్చదనం
కీ ఇచ్చిన యంత్రాల్లా కాళ్ళ నడక
ప్రకృతి పరవశంలో హృదయాలు
పక్షుల పాటల పదనిసలు
కోరస్‌తో పూలు రాలుస్తున్న చెట్లు
నడక జింకలు వేగం
సైకిళ్లతో పోటీ పరుగుల రాగం
బోసినవ్వుల అడుగులకు
చిటికెన వేలు చేయూత పార్క్
అంబాడటం ఉట్టికెక్కిస్తే
తడబాట్లు, తప్పటడుగులూ మురిపం
ఆట ఊయల కావచ్చు
జారుడు బండగా మారొచ్చు
వస్తువేదైనా కావచ్చు
ఏదీ కాకపోవచ్చు
సంచిలో కూర్చొని
హత్తుకొనొచ్చే కంగారు పిల్లలు
సంకనెక్కితే గారాబాల పంటలు
వదిలేస్తే ఆటల లోగిళ్లలో
అమ్మానాన్నలు ఆనందాలలో
పడిలేచిన కెరటాలు కదలికలు ఆదర్శం
పోటురాళ్లు తొలగిస్తుంటేనే మార్గం
చల్లగాలి సెలైన్ గుండెలకెక్కిస్తూ
మృదు సంగీత వ్యాయామ కదలికలు
యుద్ధవిద్య శ్రీకార మెలకువలు
నృత్యానికి అడుగుదూరంలో భంగిమలు
ఫిట్‌నెస్ శరీరంలోకి పంపే ప్రక్రియలు
చెమటను స్ప్రే చేసే చర్మ రంధ్రాలు
దుస్తులను ఆక్రమించక ముందే
కట్టడికోసం దస్తీల దాడులు
నడక అందరి సొంతం,
అందరి అవసరం
పడక నుంచి లేవగానే
పలకరించాల్సింది నడకే
కడుపు నింపినా, ఖాళీ చేసినా
కుర్చీ కుబుసం వీడాల్సిందే
నడకకు పాదాభివందనం
చేయాల్సిందే
ఉదయం, సాయంత్రం
నడకను దత్తత తీసుకున్నా
చెట్ల మధ్య పారే సెలయేరు నడక
సంగీతం చెవుల్లో కిక్కిస్తుంటే
కళ్లకు బుద్ధి చెప్పడం
ఆక్సిజన్ నడకకు
జోపోసన పట్టిన పార్క్
పార్క్ పంచే పరిమళం ఆరోగ్యం
నడకకు వీడ్కోలు పలికితే
మిగిలేది పడకే!

# తెలుగు రూపక సాహిత్యంలో దళిత జీవన సంవేదన



❖ తన్నీరు కళ్యాణ్ కుమార్
9490776385

పౌరాణిక, చారిత్రక, సాంఘిక ఇతివృత్తాలతో తెలుగు నాటక కర్తలు దళిత జీవితాన్ని చిత్రించే ప్రయత్నం చేశారు. అస్పృశ్యతను రూపుమాపడం, దళితులకు దేవాలయ ప్రవేశం కల్పించడం, వర్ణాంతర వివాహాల్ని ప్రోత్సహించడం, దళితులకు చదువు యొక్క ఆవశ్యకతను తెలియజేయడం, దళితుల సాంఘిక-ఆర్థిక స్థితిగతులకు వెల్లడించడం, అగ్రవర్ణ అధికృత పై తిరుగుబాటు చేయడం తదితర అంశాల్ని ఇతివృత్తాలుగా తీసుకొని రచయితలు రూపక రచనలు చేశారు. ఈ విధంగా వచ్చిన నాటికల్ని, నాటకాల్ని, ఏకాంకికల్ని రూపకాలుగా పేర్కొనవచ్చు.

దళితుల జీవన విధానాన్ని చైతన్యవంతంగా చిత్రించిన సాహిత్యం దళిత సాహిత్యం. దళితుల అభ్యున్నతి కోసం ఎవరు రాసినా అది దళిత సాహిత్యంగానే పరిగణించవచ్చునని కొందరు విమర్శకులు భావించారు. దళితులే తమ సమస్యలకు ప్రతిస్పందించి రాస్తే దాన్ని "ఆత్మాభిమానం వాదం' గానూ దళితేతరులు దళితుల పక్షాన్ని వహించి రాస్తే దాన్ని "ఉదారవాదం' గానూ పరిగణించారు. తెలుగులో దళిత సాహిత్యం ప్రధానంగా "దళిత కవిత్వమే' అన్నంతగా కవిత్వం వెలువడింది. అదే స్థాయిలో కాకపోయినా కథలు కూడా ఎక్కువగానే వెలువడ్డాయి. నవలలు, నాటకాలు కూడా వచ్చినా సంఖ్యాపరంగా చెప్పుకోదగినన్ని రాలేదు.

1930 ప్రాంతం నుండి దళిత జీవితాలను ప్రస్తావిస్తూ నాటకాలు, నాటికలు, ఏకాంకిలు రావడం ప్రారంభమయ్యాయి. ఇదే సమయంలో తెలుగులో దళిత పద్య కవిత్వం కూడా వెలువడింది. పౌరాణిక, చారిత్రక, సాంఘిక ఇతివృత్తాలతో తెలుగు నాటక కర్తలు దళిత జీవితాన్ని చిత్రించే ప్రయత్నం చేశారు. అస్పృశ్యతను రూపుమాపడం, దళితులకు దేవాలయ ప్రవేశం కల్పించడం, వర్ణాంతర వివాహాల్ని ప్రోత్సహించడం, దళితులకు చదువు యొక్క ఆవశ్యకతను తెలియజేయడం, దళితుల సాంఘిక-ఆర్థిక స్థితిగతులకు వెల్లడించడం, అగ్రవర్ణ అధికృత పై తిరుగుబాటు చేయడం తదితర అంశాల్ని ఇతివృత్తాలుగా తీసుకొని రచయితలు రూపక రచనలు చేశారు. ఈ విధంగా వచ్చిన నాటికల్ని, నాటకాల్ని, ఏకాంకికల్ని రూపకాలుగా పేర్కొనవచ్చు. ఈ రూపకాల్ని ఇతివృత్తాన్ని బట్టి ప్రధానంగా ఐదు రకాలుగా వర్గీకరించవచ్చు.

అస్పృశ్యత జాడ్యం అంతరించాలన్నా, కుల అసమానతలు అంతరించాలన్నా వర్ణాంతర వివాహాలు అవసరమని అనేకమంది మేధావులు ఉద్బోధించారు. డా.బి.ఆర్. అంబేద్కర్,బాబూ జగజ్జీవనరామ్ ఈ వర్ణాంతర వివాహాల ఆవశ్యకతలని పదేపదే ప్రస్తావించేవారు. అట్లే ఇద్దరూ బ్రాహ్మణ స్త్రీలను వర్ణాంతర వివాహాలు చేసుకున్నారు. మాదిగల ఆడపడుచుగా భావించే అరుంధతీదేవి, వసిష్టు'డిని వివాహం చేసుకున్న ప్రేమకథను బోయి భీమన్న 'రాగవాసిష్ట'ం' (1959) అనే పేరుతో పౌరాణిక నాటకంగా రాశారు. మాదిగ జీవితాన్ని చిత్రించిన తొలి తెలుగు నాటకంగా ఈ నాటకాన్ని పేర్కొనవచ్చు. అరుంధతీ కులం తెలియగానే బ్రాహ్మణుడైన వసిష్ట'మహర్షి ఆమెను వివాహం చేసుకోవడానికి సందేహించడం, చివరకు ఆమె గొప్పతనాన్ని, భక్తి

తత్పరతలను తెలుసుకొని వివాహం చేసుకోవడం నాటకంలోని ఇతివృత్తం. బోయి భీమన్న రాసిన 'పాలేరు' నాటకం కూడా వర్ణాంతర వివాహాల ఆవశ్యకతను నొక్కి చెప్పింది. ఈ నాటకం లో పాలేరు వెంకన్న చదువుకొని ఉన్నత స్థాయికి చేరుకొని అగ్రవర్ణానికి చెందిన వనబాలను వివాహం చేసుకుంటాడు. ఈ నాటకంలో పలు సందర్భాలలో ఉపకారి మాస్టారి చేత వర్ణాంతర వివాహాల ఆవశ్యకతను రచయిత చెప్పించారు.

**సమాజంలోని విద్యావంతులు, అభ్యుదయ వాదులు వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించి కుల నిర్మూలనకు పూనుకోవాలని బండారు మృత్యుంజయబాబు రాసిన 'సమాజం మారాలి' అనే నాటకం సందేశాన్నిస్తుంది.**

మతాంతర-వర్ణాంతర వివాహాల ఆవశ్యకతను గూర్చి చెప్పిన మరో నాటకం మల్లాది సత్యనారాయణ రాసిన 'పేదపిల్ల'. వర్ణాంతర వివాహం చేసుకోవడానికి సిద్ధమైన ప్రేమ జంటను సంఘం, బంధువులు అడ్డుకోవాలని ప్రయత్నించడం ఈ నాటకంలో కన్పిస్తుంది. భారతీయ సమాజం కులాన్ని బట్టి-అంతస్తును బట్టి వ్యక్తిని గౌరవిస్తున్న తీరు పట్ల ఈ నాటకం నిరసనను వ్యక్తం చేస్తుంది. బంధువులను-సంఘాన్ని ఎదిరించి వర్ణాంతర వివాహాలను చేసుకున్న జంటను సమాజం స్వాగతించని తీరును గూర్చి ఈ నాటకం తెలుపుతుంది. కుల నిర్మూలన మార్గాలలో వర్ణాంతర వివాహాలు ఒకటి. ఇవి సఫలీకృతం కావాలంటే ప్రేమ ముఖ్య సాధనం. అది ఉంటే వర్గం అవసరం లేదు. కావున ప్రేమ ఉంటే వర్ణాంతర వివాహాలు సులభసాధ్యమని, తద్వారా అంటరానితనం పోగొట్టవచ్చునని గువ్వా మురహరిరెడ్డి రచించిన 'కల్యాణి' నాటకం ప్రబోధిస్తుంది. సమాజంలోని విద్యావంతులు, అభ్యుదయ వాదులు వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించి కులనిర్మూలనకు పూనుకోవాలని బండారు మృత్యుంజయబాబు రాసిన 'సమాజం మారాలి' అనే నాటకం సందేశాన్నిస్తుంది.

కులం తెలియక ముందు అన్యోన్యంగా బతికే మాదిగ - బ్రాహ్మణ దంపతులు కులం తెలిసిన తరువాత పొందే సంఘర్షణను కొలకలూరి ఇనాక్ తన 'త్యాగి' అనే నాటకంలో గొప్పగా చిత్రించారు. వ్యక్తుల మధ్య సరైన అవగాహన ఉంటే సహజీవనానికి కులం ఏమాత్రం అడ్డుకాదని ఈ నాటకం నిరూపించింది. బ్రాహ్మణ, మాదిగ వర్ణాల మధ్య జరిగే ప్రేమ-పెళ్ళి-కుల కట్టుబాట్లు, వాటి వల్ల వచ్చే సంఘర్షణలు, వాటిని ఎలా అధిగమించాలో మాగంటి పార్థసారధి రాసిన 'హరిజనోద్ధరణము' నాటకం తెలియ జేస్తుంది. పాటిబండ్ల ఆనందరావు రాసిన 'నిషిద్ధాక్షరి' నాటకంలో దళితుడైన వర్ధనం అనే కుర్రవాడు, అగ్ర కులజ అయిన అరుంధతిని వివాహం చేసుకోవడం ప్రధాన ఇతి వృత్తం. అనేక అడ్డంకులు, సంఘర్షణల మధ్య వీరిద్దరి వివాహం జరుగుతుంది. వీరి వివాహంతో గ్రామంలోని అగ్రకులజులు, నిమ్నజాతులు ఒకటవుతాయి. మొదట ఈ వివాహానికి అంగీకరించని అరుంధతి తండ్రి చివరకు యజ్ఞోపవీతాన్ని తెంచుకొని, దళితులతో మమేకం కావడం అభ్యుదయమేనని చెప్పాలి. పినిశెట్టి శ్రీరామమూర్తి రచించిన 'కులం లేని పిల్ల' అనే నాటకంలో ఒక యువకుడు తన కులం గాని తక్కువ కులం పిల్లను పెళ్లి చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు, సంప్రదాయవాద బద్ధుడైన అతని తండ్రి ఇందుకు నిరాకరిస్తాడు. కుల గౌరవం కోసం తండ్రి కొడుకుని చంపడానికి సైతం ప్రయత్నిస్తాడు. పినిశెట్టి ఈ నాటకం ద్వారా కుల నిర్మూలన సందేశాన్నిచ్చారు.

భారతీయ సమాజంలో కులం కారణంగా హిందు మతంలోని దళితులకు దేవాలయ ప్రవేశం నిషేధించబడింది. మానవ సృష్టి భగవంతుని సంకల్పమని మతం చెబుతుంది. కానీ అలాంటి భగవంతుడ్ని దర్శించుకునే భాగ్యం కేవలం కొన్ని వర్ణాలకు మాత్రమే ఉందని, సామాజిక ప్రాధాన్యత లేని కులాల వారికి లేదని హిందూ మతంలోని కొందరు కుహనవాదుల వితండవాదం వల్ల దళితులు ఆలయ ప్రవేశాన్ని కోల్పోయారు. దళితులు ఆలయ ప్రవేశం చేస్తే దేవుడు మైలపడతాడని, వర్ణధర్మానికి భంగం వాటిల్లుతుందని , అరిష్టాలు సంభవిస్తాయనే కొందరు హిందూ మత మూర్ఖుల ఆలోచనలను ఖండిస్తూ కొన్ని నాటకాలు వెలువడ్డాయి. నీలకంఠశాస్త్రి రాసిన 'హరిజనుడు' నాటకం ఈ నేపథ్యంలో వెలువడిందే. ఈ నాటకంలో అగ్ర వర్ణాలు విధించిన ఈ సాంఘిక దురాచారానికి భగవంతుడు భయపడి, తన హరిజన భక్తుడిని వదులుకోలేక, పూజారి మాటను అతిక్రమించలేక రాత్రిపూట ఎవరూ చూడని వేళ హరిజనుణ్ణి దేవాలయంలోకి తీసుకుపోయినట్లు ఈ నాటకంలో చిత్రించబడింది.

'మాలపల్లి' నవలతో సంచలనానికి తెరతీసిన ఉన్నవ లక్ష్మీనారాయణ 'హరిజన నాటకం'(1933) పేరుతో

ఏకాంకికను రాశారు. దళితులు సంఘటిత శక్తిగా మారి ఛాందసవాదులను ఎదిరించి దేవాలయ ప్రవేశం చేయాలని ఈ ఏకాంకిక ప్రబోధిస్తుంది. ఓరుగంటి కృష్ణకౌండిన్య రాసిన 'భక్త నందనార్' నాటకంలో అంటరానికులంలో పుట్టి అధిక భక్తి సంపన్నుడై ముక్తిని పొందిన నందనారు ఈ నాటకంలో కథానాయకుడు. దళిత కుటుంబంలో పుట్టిన నందనారు పాలేరుగా జీవితాన్ని కొనసాగిస్తూ, యజమాని పెట్టే కష్టాలను ఓర్చుకుంటూ కూడా భగవద్భక్తినిడకుండా ముక్తి పొందటం ఈ నాటకంలోని ప్రధాన ఇతివృత్తం. ఏ కులంలో పుట్టినా, ఏ మతంలో పుట్టినా నిష్కళంక హృదయంతో భగవంతుడ్ని కొలిస్తే ముక్తి పొందవచ్చునని ఈ నాటకం సందేశాన్నిస్తుంది. అంత్య కులంలో పుట్టి, భక్తితో భగవంతుని హృదయాన్ని దోచుకున్న నందనారు జీవిత నేపథ్యంలో వచ్చిన మరో నాటకం పసుమర్తి యజ్ఞనారాయణ రాసిన 'నందనారు' నాటకం. మాల కులంలో పుట్టి , ఎదనిండా భక్తిని నింపుకొని, భక్త్యావేశంతో భగవంతుని సాన్నిధ్యం పొందిన నందనారు అనే భక్తుని గొప్పతనాన్ని గూర్చి ఈ నాటకం తెలియజేస్తుంది.

భగవంతుడు అందరివాడని, ఆయనకు హెచ్చుతగ్గులు లేవని దరా భాస్కరమ్మ రాసిన 'దేవాలయ ప్రవేశం' అనే నాటకం ప్రబోధిస్తుంది. కులం పేరుతో దళితులను తక్కువ వారిగా పరిగణిస్తూ, దేవాలయ ప్రవేశాన్ని రద్దు చేయడాన్ని ఈ నాటకం వ్యతిరేకిస్తుంది. అంతేగాక సామాజికంగా వెనుకబడిన దళితులను అన్ని రంగాల్లో ప్రోత్సహిస్తూ, వాళ్ళ అభ్యుదయానికి నడుంకట్టాలని కూడా ఈ నాటకం ప్రబోధిస్తుంది. కొలకలూరి ఇనాక్ రాసిన 'మునివాహనుడు' నాటకం కూడా దళితుల దేవాలయ ప్రవేశాన్ని, వారి భక్తిని శక్తివంతంగా చాటి చెప్పింది. శ్రీరంగనాథ దేవాలయ ప్రవేశానికి ప్రయత్నించి విజేయుడైన తిరుప్పాణ్ ఆళ్వార్ కథ ఇందులోని ఇతివృత్తం. దేవాలయ ప్రవేశానికి, పూజ చేసుకోవడానికి భగవంతునికి లేని అభ్యంతరం పూజారులకు ఎందుకని ఈ నాటకం నిలదీస్తుంది.

తరతరాలుగా అక్షరాలకు దూరంగా ఉంచబడిన మాదిగలకు అక్షరాలు ఎలా నిషిద్ధమయ్యాయో పాటిబండ్ల ఆనందరావు రాసిన 'నిషిద్ధాక్షరి' అనే నాటకం తెలుపుతుంది. సమాజంలోని పాలేరు వ్యవస్థను కూకటి వ్రేళ్ళతో సహా పెకిలించి వేయాలనే లక్ష్యంతో బోయి భీమన్న రాసిన నాటకం 'పాలేరు'. దళిత యువకులంతా పాలేరుతనాన్ని మాని, చదువుకొని ఉన్నత ఉద్యోగాలను సాధించాలని ఈ నాటకం ప్రబోధిస్తుంది. ఈ నాటకంలో పాలేరు వెంకన్న కష్టపడి చదువుకొని కలెక్టర్ ఉద్యోగాన్ని సాధించి, తన జీవన గమనాన్ని మార్చుకుంటాడు. ఈ పాత్ర దళితులెందరినో చైతన్యపర్చింది. నేడు సమాజంలో పాలేరు వ్యవస్థ కనిపించకుండా పోవడానికి ఈ నాటకం ఎంతగానో దోహదం చేసింది. దళిత సామాజిక వర్గాలలో ఈ నాటకం పూర్తి స్థాయి చైతన్యాన్ని తీసుకొచ్చింది. తరతరాలుగా అవమానకరమైన జీవితాన్ని గడుపుతున్న దళితుల జీవితాల్లో మార్పు తీసుకొనిరాగల శక్తివంతమైన ఆయుధం విద్య మాత్రమేనని ఈ నాటకం ప్రబోధిస్తుంది.

దళితులకు విద్య యొక్క ఈ ఆవశ్యకత చాటిన మరో నాటకం ఆచార్య ఎన్.జి.రంగా రాసిన 'హరిజన నాయకుడు' (1933)అనే నాటకం. ఈ నాటకంలో నాయకుడు బసవలింగయ్య కూడా పాలేరే. క్రైస్తవ మిషనరీల సహాయంతో చదువుకొని బసవలింగయ్య న్యాయవాది అయ్యి, తమ జాతి ప్రజల అభ్యుదయం కోసం పాటుపడటం ఈ నాటకంలోని ప్రధాన ఇతివృత్తం. విద్యావంతులైన దళితులు ధర్మబద్ధంగా వ్యవహరిస్తూ స్వజాతీయులకు స్ఫూర్తిగా నిలవాలని 'పాలేరు', 'హరిజన నాయకుడు' అనే నాటకాలు సందేశాన్నిస్తాయి. పాలేర్ల వ్యథాపూరితమైన జీవితాన్ని చిత్రించిన మరో నాటకం సుంకరి సత్యనారాయణ రాసిన 'జీతగాడు'. యజమానులకు బానిసలై వెట్టిచాకరి చేసే పాలేర్ల జీవితాన్ని గూర్చి ఈ నాటకంలో రచయిత చక్కగా వివరించే ప్రయత్నం చేశారు. భూస్వాములు పాలేర్లను చీటికి మాటికి కొట్టడం, నోటి కొచ్చినట్లు తిట్టడం, తిండి సరిగా పెట్టకుండా వేధించడం ఇలాంటి అంశాలను ఈ నాటకంలో రచయిత చక్కగా స్పృశించే ప్రయత్నం చేశారు.

దళితులను హింసించడం, వెలి వేయడం, వారిచే వెట్టి చాకరి చేయించడం, బానిసలుగా చూడటం, హోటళ్ళలో - విద్యాలయాల్లో వివక్షను ప్రదర్శించడం - అవమానించడం, దళిత మహిళపై అత్యాచారాలు చేయడం, పేదరికంతో కూడిన దళితుల దుర్భరజీవితం తదితర దళిత సమస్యల్ని ఇతివృత్తాలుగా తీసుకొని రచయితలు నాటకాలను రూపొందించారు. దళిత సమస్యలకు అద్దంపట్టే మరో నాటకం నీలకంఠశాస్త్రి రాసిన 'హరిజనుడు'. దళిత సమస్యల నిర్మూలనలో అగ్రవర్ణాలతో పాటు, దళితులకు సైతం కొన్ని

బోయి భీమన్న రాసిన నాటకం 'పాలేరు'. దళిత యువకులంతా పాలేరుతనాన్ని మాని, చదువుకొని ఉన్నత ఉద్యోగాలను సాధించాలని ఈ నాటకం ప్రబోధిస్తుంది.

బాధ్యతలను నిర్వర్తించాలని ఈ నాటకం తెలియజేస్తుంది. అంటరానితనాన్ని విమర్శిస్తూ, మానవ దృక్పథంతో రాయబడింది పసుమర్తి యజ్ఞనారాయణ 'గ్రామసేవ' అనే నాటకం. స్వతంత్ర భారతదేశంలో హరిజనులు ఎదుర్కొంటున్న సమస్యల్ని, వారి స్థితిగతుల్ని ఎత్తిచూపుతూ వాటి పరిష్కారం కోసం కృషి చేయాల్సిన బాధ్యతను ఈ నాటకం వ్యక్తీకరిస్తుంది.

**సి.ఎస్. రావు తన 'ఊరుమ్మడి బతుకులు' నాటకంలో నిమ్నజాతికి చెందిన గన్నయ్య అగ్రకులానికి చెందిన పెద్దకాపు అణిచివేతకు గురైన రీతిని వివరించారు.**

దళితులపై అగ్ర వర్ణానికి చెందిన భూస్వాములు సాగిస్తున్న అఘాయిత్యాలను గూర్చి కె. చిరంజీవి రాసిన నాటకం 'నీలి దీపాలు'. మాదిగ స్త్రీని బలాత్కరించబోయిన అగ్రవర్ణ భూస్వామి కొడుకు పై తిరగబడినందుకు గాను ఆ యువతిని, ఆమెజాతి వాళ్ళందరిపై అగ్రవర్ణ భూస్వాముల సాగించిన దారుణ కృత్యాలను గూర్చి ఈ నాటకంలో చిత్రించబడింది. ఇంచుమించు ఇలాంటి నేపథ్యంలో వెలువడిన మరో నాటకం కె.ఎస్.టి. సాయి రాసిన 'పరమపదం'. వల్లూరి శివప్రసాద్ రాసిన 'శ్రీముఖ వ్యాఘ్రం' అనే నాటికలో ధనవంతుల చేతిలో దళితులు బాధలను అనుభవించి హత్యకు గురైన తీరును చిత్రించారు. అనాదిగా దళితులు ధనవంతులు చేతుల్లో కీలుబొమ్మలు గానే ఉండిపోతున్నారని, చైతన్యవంతులు కాలేకపోతున్నారనే ఆవేదనను ఈ నాటిక వ్యక్తం చేస్తుంది. ఇక్కుర్తి నరసింహారావు 'పిడికిలి' అనే నాటకంలో అగ్రకులాలవారు అణగారిన జనాన్ని అణగదొక్కడాన్ని చిత్రించారు. చైతన్యవంతులు కాని అమాయకులైన సామాన్యులను అగ్రకులాల వారు దోచుకొనే తీరు ఇందులో వివరించబడింది. సి.ఎస్. రావు తన 'ఊరుమ్మడి బతుకులు' నాటకంలో నిమ్నజాతికి చెందిన గన్నయ్య అగ్రకులానికి చెందిన పెద్దకాపు అణిచివేతకు గురైన రీతిని వివరించారు. అస్పృశ్యత నివారణార్థం డా. అంతటి నరసింహం 'సమరసత్వం', 'సహజీవనం', 'మానవత్వం', 'పరిష్కారం' - అనే నాలుగు నాటకాలు రచించారు.

సాంఘిక, రాజకీయ, ఆర్థిక రంగాల్లో దళితుల్ని అగ్రవర్ణాలు అణగద్రొక్కుతున్న విధానాన్ని కళ్ళ ముందు నిలిపిన నాటకం వన్నెకంటి బాలసుందరం రాసిన 'నవయుగం' అనే నాటకం. సంఘంలో ఉన్నత వ్యక్తులుగా చెలామణి అయ్యే అగ్రవర్ణాల వారు దళితుల శ్రమను దోచుకుతింటున్న వైనాన్ని ఈ నాటకం తేటతెల్లం చేస్తుంది. దళితుల స్థితిగతులపై అద్భుతమైన నాటకాలు రూపొందించిన బోయిభీమన్న రాసిన ఏకాంకిక 'పడిపోతున్న అడ్డుగోడలు'. మనిషికి, మనిషికి మధ్యనున్న కులం అనే అడుకోడలు భవిష్యత్తులో తొలిగిపోగలవనే ఆశా భావాన్ని ఈ ఏకాంకిక వ్యక్తం చేస్తుంది. కళాశాలలో చదువుకుంటున్న దళిత విద్యార్థులకు సహ విద్యార్థుల ద్వారా ఎదురయ్యే కులపరమైన అవమానాలను గూర్చి కొలకలూరి ఇనాక్ రాసిన 'నిర్ణయం' నాటిక తెలియజేస్తుంది. తరతరాలుగా నమ్ముకున్న కులవృత్తికి సంఘంలో గౌరవం లభించనప్పుడు, ఆ వృత్తి ఆర్థిక - జీవన పరిపుష్టికి తోడ్పడనప్పుడు ప్రత్యామ్నాయ వృత్తులను ఎంచుకోవాలని ఎం.కన్నబాబు రాసిన 'రత్నగర్భంలో నిత్య దరిద్రుడు' అనే నాటకం సందేశాన్నిస్తుంది.

అస్పృశ్యతను సమాజం నుండి తరిమికొట్టాలనే నేపథ్యంతో రాయబడిన మరో కాల్పనిక నాటకం తాండ్ర సుబ్రహ్మణ్య శాస్త్రి రాసిన 'పతితపావన'. కులం ఆధారంగా దళితులను అస్పృశ్యులుగా ముద్రవేసి వారి హక్కులను హరించి, వారిని అనేక రకాలుగా అవమానిస్తూ అధిపత్యాన్ని వహించే అగ్రవర్ణాల వారి ఆగడాలను ఎండగట్టే ప్రయత్నాన్ని రాయసం వెంకట రమణయ్య రాసిన 'దేవదాసు' నాటకం చేస్తుంది. దళితులు పుట్టకతో అంటరానివారు కాదని, మనుష్యులు తమ స్వార్థం కోసం వారిని ఆ విధంగా తయారుచేశారనే చారిత్రిక సత్యాన్ని తాతా జగన్నాథరావు రాసిన 'జన్మహక్కు' అనే నాటకం వెల్లడిస్తుంది. దళితుల జన్మహక్కులను సమాజంలోని ఒక వర్గం ఏవిధంగా హరిస్తుందో ఈ నాటకం తెల్పుతుంది. అస్పృశ్యత - అంటరానితనాలను సమాజం నుండి తరిమికొట్టడానికి నేటి యువత నడుంబిగించాలని ఈ నాటకం సందేశాన్నిస్తుంది. తరతరాలుగా హిందూ మతం దళితులకు అన్యాయం చేసిందని, హిందువులు అందులోనూ అగ్రవర్ణాల వారు దళితుల పట్ల ఉదాసీనత వీడి, అన్ని రంగాల్లో వారి అభ్యున్నతిని కాంక్షించాలని మాగంటి పార్థసారధి ఆచార్యులు రాసిన 'హరిజనోద్ధరణ' అనే నాటకం ఉద్భోదిస్తుంది. అగ్రవర్ణాల వారు అస్పృశ్యతా జాఢ్యాన్ని వీడి, నిమ్నజాతుల పట్ల సోదరభావంతో మెలగాలని ఈ నాటకం ఉపదేశిస్తుంది.

తరతరాలుగా సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో దోపిడికి గురి అవుతున్న దళితులు ప్రతిఘటించాలని, అప్పుడే సామాజిక మార్పు సాధ్యమవుతుందని ధర్మవరం గోపాలచార్యులు రాసిన 'అస్పృశ్య విజయం' అనే నాటకం

తెలుపుతుంది. ధర్మం పక్షాన నిలిచిన దళితులకు పోరాటంలో విజయం తప్పక వరించి తీరుతుందని ఈ నాటకం జోష్యం చెబుతుంది. సాటి వ్యక్తులైన దళితులను కులం పేరుతో అవమానించడం నేరమని, దళితులకు అన్ని రంగాలలో సమానమైన ప్రాధాన్యతను కల్పిస్తూ, వాళ్ళను మనుష్యులుగా గుర్తించాలని ఈ నాటకం ప్రబోధిస్తుంది. మునిమాణిక్యం నరసింహరావు రచించిన సాంఘిక నాటకం 'తిరుగుబాటు'(1938). అగ్రవర్ణాలు సాగిస్తున్న అమానుష చర్యలకు, దౌర్జన్యాలకు కడుపుమండిన దళితులు వారిపై తిరగబడటం ఈ నాటకంలోని ప్రధాన ఇతివృత్తం. పోరాటాలతో దళితుల తలరాత మారుతుందని ఈ నాటకం సందేశాన్నిస్తుంది. కాశీ విశ్వనాథ్ రాసిన 'రాముడు లేని రాజ్యం' అనే నాటకలో దుష్టుడైన కొండబాబు చేతిలో దళితులు దోపిడీకి లోనైన తీరు స్పష్టం చేశారు. ధనవంతుడైన కొండబాబు దళితుల అవసరానికి అప్పులిచ్చి వాళ్ళను బానిసలుగా చేసుకుంటూ ఉంటాడు. స్త్రీలపై అత్యాచారాలు చేస్తూ ఉంటాడు. దళితుల పిల్లలు చదువుకోకుండా అడ్డుపడుతుంటాడు. చివరకు దళితులు కొండబాబు దుర్మార్గాన్ని గుర్తించి, ఆయుధాలతో ఎదిరిస్తారు. ఆ సందర్భంలోనే కొలకలూరి ఇనాక్ 'దిక్కులేనోడు', వి.ఎస్. కామేశ్వరరావు 'ఈ మంటలార్పండి', దోనేపూడి రాజారావు 'న్యాయం నెగ్గింది', విరియాల లక్ష్మీపతి 'పంచమ వేదం' మొదలైన నాటికలు పేర్కొనదగ్గవి. దళితులందరూ ఏకమైతే ఏమైనా సాధించగలరని డి. విజయభాస్కర్ తన 'కుర్చీ' నాటకం ద్వారా నిరూపించే ప్రయత్నం చేశారు. రాజకీయాలలోని రిజర్వేషన్ ను అనుసరించి ఎన్నికల్లో గెలుపొందిన దళిత నాయకులను, అగ్రవర్ణ నాయకులు తమ చెప్పుచేతల్లో పెట్టుకొని అధికారం చెలాయిస్తున్న తీరును ఈ నాటకం తేటతెల్లం చేస్తుంది. గత దశాబ్దిలో దళితులు అనాదిగా అణిచివేతకు, దోపిడికి గురి అవుతూ, ఇంకేమాత్రం సహించలేక ఎదురు తిరిగి సమాజంలో తమ స్థానాన్ని పొందడం కోసం పోరాటం సాగించినట్లే, ఈ 1990 దశాబ్దిలో కూడా పోరాటం సాగించినట్లు ఈ నాటకాల వల్ల విదితమవుతుంది.

తెలుగు సాహిత్యంలో వెలువడిన దళిత జీవన చిత్రణ రూపక క్రమపరిణామం గమనిస్తే తొలితరం వెలుగు చూసిన రూపకాలు దళిత జీవన సమస్యలను చిత్రిస్తూ, వారి పట్ల సానుభూతిని వ్యక్తం చేస్తాయి. గాంధేయవాద ప్రభావం ఈ రూపకాల పై ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఆ తరువాత వచ్చిన రూపకాలపై అంబేద్కరిజం, మార్క్సిజం ప్రభావం కన్పిస్తుంది. ఈ నాటకాలలో అగ్రవర్ణాల ఆధిపత్యాన్ని ప్రశ్నించే తత్త్వం కన్పిస్తుంది. చివరి దశలో వచ్చిన నాటకాలలో అవమానకర పరిస్థితులపై తిరుగుబాటు ధోరణి కన్పిస్తుంది. తెలుగు రూపకాలలో దళిత జీవితాన్ని చిత్రించడం 1930 ప్రాంతం నుండి కన్పిస్తుంది. ఐతే పూర్తి స్థాయి దళిత సాహిత్య లక్షణాలను పుణికి పుచ్చుకొని వెలుడిన తొలి తెలుగు నాటకంగా బోయి భీమన్న రాసిన 'రాగ వాశిష్టం (1959) ను పేర్కొనవచ్చు.

**గాంధేయవాద ప్రభావం ఈ రూపకాల పై ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఆ తరువాత వచ్చిన రూపకాలపై అంబేద్కరిజం, మార్క్సిజం ప్రభావం కన్పిస్తుంది. ఈ నాటకాలలో అగ్రవర్ణాల ఆధిపత్యాన్ని ప్రశ్నించే తత్త్వం కన్పిస్తుంది.**

ఈ రూపకాలలో కొన్ని తెలుగు దేశంలో పలు ప్రాంతాల్లో ప్రదర్శించబడి, ప్రేక్షకుల నీరాజనాలను అందుకున్నాయి. నిరక్షరాస్యులు అధికంగా ఉండే దళిత సామాజిక వర్గాలను కదిలించడంలోను, చైతన్యపర్చడంలోను, విద్య పట్ల ఆసక్తిని కలుగజేయడంలోను, పాలేరుతనానికి స్వస్తి పలికేటట్లు చేయడంలోను రూపక సాహిత్య ప్రక్రియ కీలక భూమికను పోషించిందని చెప్పవచ్చు. సమాజంలోని అగ్ర వర్ణాల వారిని సైతం ఈ రూపకాలు ఆలోచింపజేశాయి. మరీ ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలోని దళితులను ఈ రూపకాలు ప్రదర్శనల రూపంలో ఆకట్టుకున్నాయి. తెలుగు నాటక సాహిత్యంలో కన్యాశుల్కం తరువాత సమాజంపై అధిక ప్రభావం చూపిన నాటకంగా బోయి భీమన్న రాసిన పాలేరు నాటకం ప్రఖ్యాతి గాంచింది.

1995 నాటికి తెలుగులో దళిత వచన కవిత్వం విజృంభిస్తున్న తరుణంలో దళిత రూపకాలు క్రమంగా కనుమరుగు కావడం మొదలైంది. సినిమాలు, టెలివిజన్ల ప్రభావానికి రూపకాలు నిలబడలేకపోయాయి. ఆ తరువాత కాలంలో క్రమంగా దళిత వాదం సాహిత్యంలో బలహీనపడటం, వర్గీకరణ ఉద్యమప్రభావం సాహిత్యంపై ప్రతిబింబించడం తదితర కారణాలతో తెలుగులో దళిత రూపక ప్రక్రియ అదృశ్యమయింది. తెలుగులో దళిత రూపకాలు సంఖ్యాపరంగా చెప్పుకోదగ్గ స్థాయిలో వెలువడకపోయినా దళిత జీవితాలపై చూపిన ప్రభావం మాత్రం అపారమని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఈత



కథ

# సైకిలు మోజు

❖ ఉదయ మిత్ర
9985203376



కొమ్మ మీద బూరీగలు బారులు తీరి ఉన్నాయి. మర్రిచెట్టు మీద ఉడుత పెళ్ళిలో హడావిడి చేసినట్టు చెట్టు మీద పైకీ కిందికీ తిర్గుతోంది. కొత్త చిగురు తిన్నదేమొ....కోయిల కొత్త పాటెత్తుకున్నది. నీలగిరి చెట్లు నెమ్మదిగా ఊగుతూ, పాటకు తన్మయత్వం చెందుతున్నట్లుగా ఉన్నాయి.

హాస్టల్ ఆవరణలో చెట్టుకింద చదువుకుంటున్న జ్ఞానేశ్వర్ ఇవేమీ గమనించేస్థితితో లేడు. వాడు దూరంగా ఆపి ఉంచిన సైకిల్ వైపు ఏకాగ్రతతో చూస్తున్నాడు. వాడికది పల్సర్ బండిలాగ, మెర్సిడైజ్ కారులాగ కన్పిస్తోంది. ఒక్కసారి ఆ సైకిల్‌ను తాకాలనీ, అట్లా సైకిలెక్కి హుషారుగ సీటిగొట్టుకుంట ఊరంత తిరగాలనీ, నిర్మానుష్యపు రోడ్డు మీద రెండు చేతులు విడిచి సైకిల్‌ను బ్యాలెన్స్ చేస్తూ నడపాలనీ వాడి కోరిక. వాడికెవరైనా, ఓ సైకిలిచ్చి, ఇంత తిండి పెడితే, సైకిల్ మీద దేశమంతా తిరిగి రావాలనుంది.

పాపం....వాడికి బతుకులో పెద్ద పెద్ద కోరికలేం లేవు. మంచి బనీన్లు వేసుకు తిరగాలని వాడి ఆశ. ఎప్పుడూ చిరిగిన బనీన్లే గతి.. కొత్త బనీన్లు కావాలంటే యుద్ధమే చేయాలి. వాడికి పొలావు అన్నం తినాలనుంది... హాస్టల్‌లో కడుపునిండా తిండి దొర్కుడే కష్టం. ఇంక పొలావు అన్నం ఎవరు బెడ్తారు? ఒక వెచ్చటి దుప్పటికోసం వాడుఎన్నాళ్ళ నుంచో కలగంటున్నాడు. అదీ తీరని కలే అయ్యింది.

అన్నింటికన్నా కోరిక మరొకటుంది. వాడికి అమ్మ పక్కన పడుకోవాలని, ఆమె చెప్పేకథలు వినాలనీ ఎంతో ఆశ. కాని..అది ఇప్పట్లో తీరేదిగాదు...తన తల్లి ఆరునెలల కిందనే దేశం (వలస) బోయింది. తండ్రి అప్పుల బాధకు ఉరేసుకున్నాడు. ఉన్న ఒక అవ్వ కాళ్లావేళ్లాపడి వాడిని ఓ సంక్షేమ హాస్టల్‌లో చేర్పించింది.

స్కూల్లో చదువుకుంటున్నా, ఏదో శూన్యం ఆవరించినట్టు ఉండేది. తోటి పిల్లలు. తమ తల్లిదండ్రుల గురించి మాట్లాడుకుంటుంటే, తాను మౌనమునిలాగ వింటూ కూర్చొనేటోడు. రోజంతా చదువులో పడ్డా...రాత్రయ్యేసరికి తల్లి జ్ఞాపకాలు చుట్టుముట్టేవి. పాలమూరుజిల్లాలో కరువు,

వలసలు పసిహృదయాల మీద ఎట్లాంటి ప్రభావమం వేస్తాయో – జ్ఞానేశ్వర్‌లాంటి పిల్లల్ని అడగాల్సిందే.

హాస్టల్‌లో భోంచేసి బయటికొచ్చిన షానవాజ్, జ్ఞానేశ్వర్ తన సైకిల్‌వైపు తదేకంగా చూడడం గమనించాడు. అతని ముఖంలో ఓ వొంకరనవ్వు వెలిసింది. గతకొన్ని రోజులుగా అతను జ్ఞానేశ్వర్‌ను గమనిస్తున్నాడు. తాను సైకిల్ ఆపి, లోపల వార్డెన్‌తో మాట్లాడుతూ ఉంటే, ఆ పిల్లవాడు తన సైకిల్ దగ్గరగా రావడం, తాకడం గమనించాడు. ఒక్కోసారి బెల్ గొట్టి పారిపోతున్నాడు.

రోజూ సైకిళ్లతో సావాసం చేసే షానవాజ్‌కు సైకిల్ ఓ మామూలు విషయంగా అన్పించినా, అది జ్ఞానేశ్వర్‌కు అపురూపంగా అన్పించడం తమాషాగ అన్పించింది.

షాన్‌వాజ్‌కు పట్నంలో ఓ సైకిల్‌షాపు, ఊరిబయట కొంతపొలం ఉన్నాయి. అతను మూడునాల్గు రోజులకోసారి వొచ్చి, తాను పెంచే పందులకోసం హాస్టల్‌లోని వ్యర్థపదార్థాలు తీసుకుపోతుంటాడు... అదీగాక హాస్టల్ వార్డెన్ అతనికి మంచి ఫ్రెండు కూడ...

❖❖❖

షానవాజ్ ఆ పిల్లవాడిని చూసి సన్నగా నవ్వాడు. అది కప్పను జూసి పాము నవ్వినట్టుగా ఉంది. జ్ఞానేశ్వర్ లేచి, బెరుకు బెరుగ్గా వొచ్చి సైకిల్ కాడ నిలబడ్డాడు... అదేమీ గమనించనట్టుగా షానవాజ్ సైకిల్ తుడుస్తున్నాడు.

"అన్నా... అన్నా...." – బెరుగ్గానే అన్నాడు జ్ఞానేశ్వర్

"ఊ... ఏందిరా..." – తల తిప్పకుండానే జవాబిచ్చాడు షానవాజ్.

"అన్నా... ఒక్కసారి.... సైకిల్ తొక్కుతన్నా"

"ఏందిరా.... ఇంతలేవు..... నువ్వు – సైకిల్ తొక్కుతవా."

ఔనన్నా..... పదినిమిషాలల్ల, తిరిగొస్తన్నా...."

"ఆహా.....గట్లనా.... ఏదీ....గీ సైకిల్ తుడువురా..."

జ్ఞానేశ్వర్ ఎగిరిగంతేసినంత పని జేశాడు. చాలా సులభమైన పరీక్ష ఇది. వాడు సైకిల్‌ను శుభ్రంగా తుడవటం మొదలెట్టాడు. హ్యాండిల్, పెడల్, రీములు, పుల్లల్తో బాటు బాగా ఇబ్బంది పెట్టే సైకిల్ చైన్‌ను కూడా చక్కగా తుడిచేశాడు. ఇపుడది షోరూములో సైకిల్ లాగ తళతళలాడ్తోంది. ఇదంతా



చేస్తూ ఉంటే, షానవాజ్ దూరంగా సిగరెట్ కాలుస్తూ నిలబడ్డాడు...

"అన్నా – అయిపోయింది" – అన్నాడు జ్ఞానేశ్వర్ సంతోషంగా...

"ఊ..." ముక్తసరిగా జవాబు

" అన్నా సైకిల్ తుడ్సినగదా – వొక్కసారి – "

"సరే... తీస్కపోగాని... బిడ్డా... సైకిల్‌కు గిట్ల యేమన్న అయ్యిందంటే... భాంచోత్... ఛమ్‌డలూడదీస్త – "

"గట్లే అన్న.... గట్లే... ఏంగానియ్య – అమ్మతోడు.."

"ఊ...బేగిరా..."

❖❖❖

వారెవ్వా... సైకిల్ చేతిలోకి తీసుకున్నాంక, జ్ఞానేశ్వర్‌కు పంచకళ్యాణి దొర్కినట్టయ్యింది. వాడు సీటు మీద గూచునేసరికి, గాల్లో తేలినట్టయ్యింది... ఒంట్లోని శక్తి అంతా కాళ్లలోనికి వొచ్చేసింది.. సైకిల్‌ఝూ...మ్మని ముందుకుర్కింది...

మొదట సర్పంచు ఇల్లు, ఆ తర్వాత ఆంజనేయుని గుడి, ఆ సందు తిరిగి, రోడ్డుమీదకొచ్చి, బంగ్లా వైపు తిరిగాడు. వాడు సైకిల్ తొక్కుతూనే, తనను అందరూ గమనిస్తున్నారో, లేదోనని ఓరకంట గమనిస్తూనే ఉన్నాడు. అంతా స్వప్నలోకంలో తిరిగినట్టుగా ఉంది... ఊరివాళ్లంతా దేవుళ్లుగాను, షానవాజ్ వాళ్లకు హెడ్ గాను కన్పించాడు.

సైకిల్ మనుషుల్ని దాటుకుంటూ రయ్..రయ్ మనిపోతోంది. అవసరమున్నా లేకున్నా సైకిల్ బెల్‌ను ట్రింగు, ట్రింగ్‌మనిపిస్తున్నాడు. అది వాడికి ఘంటసాల పాటలాగ, జలపాతపు హోరులాగ విన్పిస్తోంది.

❖❖❖

కోమటి బాలస్వామి షాపు దగ్గర రోడ్డు మలుపు తిరిగాలి. అంతే జోరుగా జ్ఞానేశ్వర్ సైకిల్ మలుపు తిప్పాడు. అంతలివైపు నుండి స్కూటర్ రావడం గమనించలేదు.. స్కూటర్ రావడమూ, సైకిల్‌కు డ్యాష్ ఇవ్వడమూ, వాడు పడిపోవటమూ వెంట వెంట జరిగిపోయాయి. మంది గుమిగూడేలోపున, స్కూటరిస్టు వెనక్కి చూడక, అదేపోతగ పోయేడు...

మిగిలింది దెబ్బలు తగిలిన జ్ఞానేశ్వరూ, అడ్డంపడ్డ సైకిలూ.. బట్టలు దులుపుకొని చూసుకున్నాడు... మోచేయి గీరుకుపోయి, సన్నగా రక్తం కారుతోంది. వాడు తనకన్నా

ముందు, సైకిల్ వైపు చూశాడు. అది గూడా వాడిలాగే మూల్గుతున్నట్టుగా ఉంది... సైకిల్‌కు ఏమన్నా అయ్యిందేమోనని, అన్ని వైపులా తేరిపార జూశాడు. వాడి గుండె గుభేల్‌మంది..వెనక చక్రానికి ఐదారు పుల్లలు విరిగి పోయాయి. వాడికి దిమ్మతిరిగినట్టయ్యింది. ఏం చెయ్యాల్నో తోచడం లేదు.



ఎవరికి చెప్పుకోవాలా? ఏమని చెప్పాలి? ఏదో హాస్టల్‌లో ఇంత చదువుకుందామనుకుంటే, ఈ సైకిల్‌పిచ్చి...ఈకాడికి దెచ్చింది. ఆ సమయాన...ఆ పోరని మనసులో ఏవేమి ఆలోచన్లు తొల్చు కొచ్చాయో..చెప్పడంకష్టం..తానొక పెద్ద బండరాయి మీద దొర్లిపడ్తున్నట్టు, గావుకేకలు వేసినా ఎవరూ విన్పించుకోనట్టు అన్పించింది....

❖❖❖

సైకిల్‌కోసరం చూస్తోన్న షానవాజ్‌కు, తన సైకిల్‌ను జ్ఞానేశ్వర్ ఆయాసపడ్తా దొబ్బుకొస్తుండటం చూసి అనుమానమేసింది. వాడి బట్టలు కూడా దుమ్ముకొట్టుకొని ఉన్నాయ్....

"ఏమయ్యిందిరా?" - అనుమానంగా అడిగాడు షానవాజ్.

"అన్నా"....అంటూ ఏడుపు ముఖం పెట్టి," స్కూటరాయన గుద్దిపోయిండన్నా..." అన్నాడు...

షానవాజ్ వాడినేమీ పట్టించుకోలేదు..తన సైకిల్‌కేమయినా అయ్యిందేమో, చుట్టూ తిరిగి చూశాడు. సైకిల్ పుల్లలు విరగడం చూసి విపరీతమైన కోపమొచ్చేసింది.

''అరే.....బద్మాష్...వొద్దంటుంటే దీస్కపోయి...గిప్పుడు సైకిల్ గీహాలతోల తెస్తావ్‌బే..." అంటూ బూతులు తిడ్తా, ఎట్లబడితే అట్లకొట్టాడు. జ్ఞానేశ్వర్ నిస్సహాయంగా నిలబడిపోయేడు, ఏ శిక్షవేసినా సరేనన్నట్టు....

"అరేయ్... ఈ సైకిల్‌కు దండుగ ఎవరు గట్టిస్తరుబే." అంటూ గల్లా పట్టుకొని అడిగేడు షానవాజ్......

"నా దగ్గర వొక్క పైసలేదన్నా..." నిస్సహాయంగా జవాబొచ్చింది.

"మీ చుట్టాలున్నార ఎవలన్నా..."

"లేరన్నా....అంతా దేశం (వలస) బోయిగ్రను..."

"మీ వార్డెన్ సార్‌ను అడిగియ్యి..."

"సార్....మూడురోజులయ్యింది...వొస్తలేడు."

వాడికి అన్ని ద్వారాలు మూసుకుపోయినట్టయ్యింది. చెట్టు మీద ఉడుత" ఏం జరుగబోతోందా?" అని ఆశ్చర్యంగా చూస్తోంది.

"అయితేనడువ్‌రా."

"యాడికన్నా..."

"సైకిల్‌షాప్‌కి..."

"ఎందుకన్నా..."

" చెప్తగద...అన్నీ ఖుల్ల ఖుల్ల చెప్తగద..." అంటూ వాణ్ణి గొరగొరా ఈడ్చుకుపోయేడు. ఆ పిల్లవాడు కబేళాకు తీసుకుపోతోన్న గొర్రెపిల్లలా అతడిని అనుసరించాడు.

❖❖❖

పాపం...సైకిల్ పుల్లలిరిగిన పాపానికి, జ్ఞానేశ్వర్ బతుకు విరిగిన సైకిల్ చక్రమే అయ్యింది. వాడు పట్నంల షానవాజ్ ఇంట్లో కట్టుబానిసైపోయాడు. పొద్దున్నేలేచి, పొలం కాడికి పరుగెత్తాలి.... పెండదీసి, దొడ్డంతా ఊడ్చి, గడ్డికొయ్యాలె...గడ్డి మోపుతో ఇంటికొచ్చి, ఇంత కతికి, సైకిల్‌షాప్‌కు పరుగెత్తాలి....

గింత చిన్న తప్పుకు, ఇంత పెద్ద శిక్షనా? అని మర్యాదస్తులకు అనుమానం రావొచ్చు. కేవలం 12రూ॥ల బాకీ కోసరం, జీవితకాలం చాకిరీ చేసిన ఆదివాసీల ఘటనలు కోకొల్లలున్నాయి. కొడుకు ప్రశ్నించిన తర్వాతనే, ఆ సంగతి బైటికొచ్చింది మరి...

❖❖❖

పాలమూరులో వలసబోయిన వాళ్లపిల్లల పరిస్థితి చెప్పదీరదు...సాధారణంగా వలసబోయినకాడ చదువుకునే స్థితిఉండదుగాబట్టి, తమతమ పిల్లల్ని హాస్టళ్లలోనో, బాలకూలీలుగానో వొదిలి వెళ్తారు. నిజం చెప్పాలంటే వాళ్లు పెంటమీద పెరిగే బీర తీగల లాంటి వాళ్లు.....అప్పుడప్పుడు పండుగల కొచ్చినపుడు, తల్లిదండ్రులొచ్చి, వాళ్లమంచిచెడ్డలు చూసిపోతుంటారు. ఆలనాపాలనా లేని ఆ పిల్లల బాల్యం....."ఎడారిలో శిథిల శిల్పం."

❖❖❖

సైకిల్‌షాపు రద్దీగా ఉంది.

జ్ఞానేశ్వర్ సైకిల్ తుడుస్తున్నాడు. వొచ్చేపొయ్యే

జనాలను దాటుకొని, అతను రోడ్డుకు అవతలి పక్కన జర్గుతోన్న ఓ దృశ్యాన్ని కన్నార్పకుండా చూస్తున్నాడు...



అవతలివైపు ఓ మినీలారీ ఆగి ఉంది. దానికి ఓపెద్ద చెక్కవేసి ఉంచారు. ఓపదిమంది కల్సి ఓ ఎద్దునుపైకి ఎక్కించే ప్రయత్నం చేస్తున్నారు. ఆ ఎద్దు ఎంతకూ ఎక్కకుండా మొరాయిస్తున్నది. ముందువైపు తోళ్లు గట్టి కొందరు గుంజుతుంటే, కొందరు వెనుకనుండి దొబ్బుతున్నారు. ఎంతజేసినా అది లారీ మాత్రం ఎక్కడం లేదు. మాటి మాటికీ కూలబడి పోతున్నది. అరుస్తున్నది... ఒక కాలు ముందుకునడిస్తే, మిగిలిన కాళ్లు మడతబడిపోతున్నవి. దాన్ని ఎక్కించడాన్కి అందరూ శతవిధాల ప్రయత్నిస్తున్నారు. ఒకడు కోపంతో దాని తోకను మెలిపెడ్తున్నాడు...ఇంకొకడు కోపంతో దాని తోకను కొరుకుతున్నాడు. అయినా అది తీవ్రంగా ప్రతిఘటిస్తున్నది...బహాశా దానికి తెల్సిపోయిందేమొ, అతను కబేలాకు తీసుకుపోతున్న సంగతి.

జ్ఞానేశ్వర్ కన్నార్పకుండా అదే జూస్తున్నాడు.... తనకన్నా ఆ ఎద్దు నయమనిపించింది...కనీసం అది ప్రతిఘటిస్తున్నది. తాను ఆ పనికూడా చెయ్యలేదు. తనను గల్లా పట్లుకొని ఈడ్చుకుపోతుంటే బానిసలాగ వెంబడించాడు..... "తనదీ ఓ బతుకేనా...ఈచాకిరీ నుండి ఎప్పుడు బయటపడాలో? తన చదువేమయిపోయిందో? అమ్మ....అవ్వా ఎట్లున్నారో..." అనుకుంటూ ధీర్ఘనిశ్వాసంలో సైకిల్ తుడువటం కొనసాగించాడు.........

వాడు పని చేస్తున్నంతసేపూ, రోడ్డు చివరి అంచు దాంకా చూడ్డం మాత్రం మానడు......

❖❖❖

చిరాగ్గా ఉన్నందుకేమొ, వాడు సైకిల్ చైన్‌ను ఎంతసెట్ చెయాలన్నా కుదరడం లేదు. అమ్మతోడు..వాడికి సైకిల్ మొత్తాన్ని తుక్కుతుక్కు చేయాలన్నంత కోపమొస్తున్నది. వాడి చేతులు ఆయిల్‌తోటి జిడ్డుగామారాయి.

రోడ్డుమీద పిల్లలు నవ్వుకొంటూ, హుషారుగా, ఉల్లాసంగా ఇండ్లకుపోతున్నారు. వాళ్లతో ఒక్కసారిగ తనను పోల్చుకున్నాడు. వాళ్లు....పారుతున్న పిల్లకాలువల వంటి వాళ్లు....తానేమొ నిలువనీరు నిల్చిన మురిగ్గుంట....

చెప్పరాని దు:ఖం..... పెంచుకోవటమే తప్ప, పంచుకోవటాన్ని ఎవరూ లేరు. తన దు:ఖం ఎవరితో చెప్పుకోవాలె? సైకిళ్లతోనా? కస్టమర్లతోనా? షానవాజ్‌తోనా? అక్కడ దేక్కుంటూపోతోన్న పిచ్చివాడితోనా? ఎవరితో చెప్పుకోవాలె? ఎవరు వినిపించుకుంటారు? ఈ ముళ్ళమీద చిరిగిన వస్త్రాన్ని ఎవరు కప్పుకుంటారు? ఎవరు తన బాల్యాన్ని చేరదీసి ఊరడించేరు?

❖❖❖

ఎవరో భుజంమీద చెయ్యేసినట్టనిపిస్తే, వెనక్కి తిరిగి చూశాడు.....చూస్తే...తన కళ్లను తానే నమ్మలేకపోయాడు.... అమ్మ.....ఎప్పుడొచ్చిందీ? ఎట్లొచ్చిందీ? అన్నప్రశ్నల్ని పక్కన బెట్టి వాడు ఏడుస్తూ తల్లిని కౌగిలించుకున్నాడు. ...వాడి చేతుల కంటిన ఆయిల్, బట్టలకంటిన మురికి అమ్మప్రేమకు అడ్డురాలేదు.... వందల, వేల ఏండ్లుగ, సృష్టికి అనాదిగ, తల్లుల కొడుకుల కిచ్చిన భరోసా, వాడికిప్పుడు దొర్కినట్టయ్యింది. ఇద్దరి దు:ఖంలో కాలం కాస్సేపు స్తంభించిపోయింది.

❖❖❖

కొడుకు కళ్లు తుడిచి, వాడి చేయి పట్టుకొని, సరాసరి షానవాజ్ దగ్గర కెళ్లింది. అతను షాపులోనుండే ఇదంతా గమనిస్తున్నాడు. "అబే..... సైకిల్ తుడువకుండా ఏం జేస్తున్నావ్‌రా..... ఈమె ఎవరు?" దాష్టీకంగా అడిగేడు షానవాజ్....

"నేనెవరో తర్వాత జెప్తగాని.....ముందు గీసంగతి జెప్పు....నాకొడ్కును సదువుమాన్పించి, గీడికెందుకు దెచ్చినవు?" నడుం మీద చెయ్యేసుకు అడిగిందాతల్లి.......

"తెల్వదా"

"చెప్పరాదూ....గంత తీరని పాపమేమి జేసిండో పసిపోరడు"

"హు....నీ పసిపోరడు.......నా సైకిలిరగ్గొట్టిండు.... నష్టం ఎవడు గట్టియ్యాలె...."

"అయితే...నీ సైకిల్ పుల్లలిరగ్గొడితే, ఆని బత్కుసెడ గొడ్తవా....నీ షాపుల ఎట్టికి వెట్టుకుంటవా...ఏమనుకున్నావ్?"

"ఏమమ్మో...మాటలు సక్కగరానీ....నీ కొడ్కును నాకాడ పని జెపిచ్చుకోనీకె, నాకు షోకేమీలేదు.... పైసలుగట్టి దీస్కపో"..

"ఓహో.... ఈ మూడు నెల్ల శాకీరీ సరిపోలేదా..."

"తిండి పెట్టలేదా.....గాఖర్చు ఎవరు తియ్యాలె"

## కవిత

# అక్షర దీపం

❖ లలితానంద్
9248499715



ఏక శరీర వీణాధారి
అవిభాజ్య సుస్వరం
అనంత ఆరోహ అవరోహణ
అజరామర ఆస్వాదన
వికసిత కుసుమం
విశాల హృదయం
సంయమనపు సౌందర్యం
సమన్వయపు సౌరభం
ఫలదీకరణ ఆలింగనం
కోయిల గొంతుల తోడ్కొని
అరచేతుల అమ్మతనపు
పరిమళాలద్దుకుని
కడుపున కారుణ్యం నింపుకుని
శిరసున హర్ష హరితాలెత్తుకుని
ఇరు నాడుల్లో రక్త ప్రసారంలా
కృష్ణా, గోదావరి, గౌతమీల్లా
నిరంతరం కాలంలో ప్రవాహం
ప్రకృతిలా-
ద్వంద్వావయవ ఏక క్రియల్లా
అనుభూతుల అవస్థల్లా
అవస్థల అనుభూతుల్లా
అంతరాల్లేని ఆకలి
అంచుల కంచెల్లేని కష్టాలు
అడ్డు గోడల్లేని ఆవేదన
గీతల్లేని కన్నీటి కడలి
సర్వకాల సమదర్శనం సంస్కారం
ఉద్వేగ రహితం మానవీయం
అక్షర దీపం శిరోధార్యం
దీపధారి దిశా నిర్దేశి

# రోహిత్...

❖ మోతి మోహనరంగ
9505474547



మొహం కడుక్కోవడానికి
వెళ్ళితే బక్కెట్టు నీళ్ళల్ల
ఉదయిస్తుండు,
పుస్తకం తెరిస్తే
ఆవేశ పరిచే కవిత్వమై
పళ్ళు కొరికిస్తుండు,
కళ్ళు మూసుకుంటే ఉద్యమమై
కల్లోకొస్తుండు,
సచ్చిండు అనొద్దు......
మన ప్రతి ప్రక్రియలో ప్రత్యక్షం
అవ్వడానికి
అదృశ్యం అయ్యిండు.

---

"ఆన్ని సదువు బందువెట్టించి, గొడ్డుశాకిరి జెపిచ్చుకొని, తిండి వెట్టిన్నని సరిపెడ్తవా... మీదికెల్లి దబాయిస్తవా...పదా...పోదాం పారా....యాడికంటే ఆడికయితది...పదిమంది నడ్గుదం. కలెక్టర్ తాన్కిపోదం.....నీముఖం మీద ఉమ్మిస్తరో.....నా ముఖం మీద ఉమ్మిస్తరో.....తెల్సిపోతది." అంటూ జ్ఞానేశ్వర్ చేయిపట్టుకొంది. మరో వైపు షానువాజ్ ఇంకో చేయిపట్టుకున్నాడు. చెరో దిక్కులాగడంతో పిల్లవాడు ఏడుపు లంకించుకున్నాడు....

❖❖❖

వాడి ఏడుపులకూ, వాళ్ల అరుపులకూ జనం పోగయ్యారు..అప్పటికే ఎవరో ఉప్పందిస్తే విలేఖరులొచ్చారు. పరిస్థితి ఉద్రిక్తంగా తయారయ్యింది. రేపటి వార్తలకు చక్కటి మేటర్ దొర్కిందని విలేఖరులు ఫోటోలు తీయడం మొదలెట్టారు. తల్లినీ, కొడుకునూ వివరాలడుగడం మొదలెట్టారు.

జ్ఞానేశ్వర్ తల్లి గొంతు పెంచింది.

''అయ్యా...నదాకున్నోల్లు....గిదంతా షూడున్రి....మేం పొట్ట తిప్పలకు దేశం (వలస) బోయినా...ఎక్కడ దిక్కులేక ఈ దిక్కుమాలిన సర్కారు హాస్టల్ల వెడితే, మాపోరడు తెల్వక గీపెద్ద మనిషి సైకిల్ పుల్లలిర్గగొట్టిండట...మీరే జెప్పున్రి......తెల్వక జేసిన తప్పుకు.....ఎంత పెద్ద శిక్ష ఏసిండో. మీరే మీకంటితో షూడున్రి....ఆని సదువుమాని పిచ్చిండు, ఈడ సైకిల్‌షాపుల ఎట్టి జేపిచ్చుకుంటున్నడు....ఎవరూ ఎన్కముందల లేరని ఎన్నడెరుగని నరకం చూపిస్తున్నడు. గాపోరన్ని జూడున్రి - బక్కటోలయ్యిండు. కండ్లు గుంజుకపోయినయి. ఈనింట్ల మన్నువొయ్య...ఈనింట్ల పీనిగెబొబ్బలెల్ల....నాకొడ్కు పానానికి వట్టిండు" అంటూ ఎత్తిఎత్తి ఏడు దోసిల్ల మన్నువోసిందాతల్లి.

పరిస్థితి చేయిదాటిపోతోందని, మెల్లిగా షానవాజ్ అక్కడ్నుంచి జారుకున్నాడు. ఉన్నట్టుండి జ్ఞానేశ్వర్, తాను ఇంత దాంకతుడిచిన సైకిల్‌ను జాడిచ్చి ఒక్కతన్ను తన్నాడు. అది నిస్సహాయంగా కింద పడిపోయింది.

కొడుకు చేయిపట్టుకొని.....గుంపును చీల్చుకుంటూ ఆ తల్లిముందు నడిచింది...జైలు గోడలు బద్దలు గొట్టి, ఖైదీని చెరవిడిపించుకున్న విప్లవకారిణిలా ఉందామె....

# డా.మానేపల్లి కథలు . సమాజం . సాహిత్యం

❖ డా.ఎస్.సత్యనారాయణ
9849416374




*డా.మానేపల్లి ప్రముఖ ఉత్తరాంధ్ర కథా రచయిత. **1960** ప్రాంతం నుండి కథలు, కవితలు, నవలలు, విమర్శలు ఇలా అనేక ప్రక్రియల్లో రచనలు చేస్తూ ఒక చేత్తో సాహిత్య సేవ ఇంకొక చేత్తో సామాజిక సేవ చేస్తూ ఈనాటికీ రచనలు చేస్తూనే ఉన్నారు. చా.సో, కా.రా, రా.వి. శాస్త్రి వంటి గొప్ప రచయితల సాహచర్యంతో అనేక కథలు రాశారు. ఆరు కథా సంపుటాలను దాదాపు **350** కథలతో వెలువరించారు. ఆయా కథలను పరిశీలిస్తే పైన పేర్కొన్న సామాజిక స్పృహ, సాహిత్య ప్రయోజనం కలిగిన కథలు అనేకం కనబడతాయి.*

సాహిత్యంలో రచయిత సమాజాన్ని దర్శించి, విశ్లేషించి, వ్యాఖ్యానించాల్సి ఉంటుంది. కాబట్టి ఏ రచయితకైనా సామాజిక దృష్టి ఎంతైనా అవసరం. సమాజంలో తన పాత్ర ఏమిటో తెలుసుకొని, సమాజంలోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతికపరమైన అంశాల్లోని విషయాలను లోతుగా పరిశీలించి, లోటుపాట్లు గుర్తెరిగి, వాటిని తన రచనలో ప్రతి ఫలింపజేసి, ఆ సమస్యలకు పరిష్కారమార్గం కూడా చూపించాల్సిన బాధ్యత రచయితపై వుంటుంది. సమాజంలోని వ్యక్తులకు గాని, రచయితలకు గాని, సామాజికస్పృహ మెండుగా ఉన్నప్పుడు ఆ సమాజం ప్రగతివైపు నడుస్తూ ముందడుగువేస్తుంది. ఈ సామాజిక స్పృహను సాంఘికస్పృహ అని, చారిత్రక స్పృహ అని, సమకాలీన స్పృహ అని రకరకాలుగా వ్యవహరిస్తున్నా వీటిమధ్య అంతర్లీనమైన అన్వయం కనబడుతుంది. "సామాజిక స్ఫురణతో ఆలోచిస్తే, చర్చిస్తే, రాస్తే, పనులుచేస్తే, వృత్తులను నిర్వహిస్తేవారికి చెందినవిధులను, హక్కులను సమాజ స్ఫురణతో ఆచరిస్తే, వారు సమాజం అవుతారని" వెలిచాల కొండలరావు సామాజిక దృక్పథాన్ని గూర్చి పేర్కొన్నారు.

సాహిత్యానికి సమాజం మూలం. నేలవిడిచి సాము చేయలేనట్లు సామాజిక నేపథ్యాన్ని కాదని సాహిత్యం మనుగడ సాగించలేదు. సమాజం నిలువనీరు కాదు. దానికి ప్రవాహగతి వుండడం సహజం. 1947-50 నాటి సాంఘిక, ఆర్థిక, రాజకీయపరిస్థితులు 2010-12లోఉండే అవకాశం లేదు. నిరంతరం మారడం అనేది ఏ సమాజానికైనా అత్యంత సహజలక్షణం. 1947-50లనాటి బ్రిటీషు పరిపాలనా ఛాయలు విద్య, వ్యాపారం, రాజకీయరంగాల్లో పూర్తిగా వైదొలగలేదు. ఆకాశవాణికేంద్రాల విస్తరణ ఈనాడు ఉన్నంతగా ఆనాడులేదు. సీరియల్స్ మెగాసీరియల్స్ దాకా ఎదిగి వెర్రితలలు వేస్తున్నాయి. రానురానూ మాతృభాషకు ప్రాధాన్యత తగ్గి ఆంగ్లభాషా వ్యామోహం పెరిగిపోయింది. బ్రిటిష్ కాలంనాడే మాతృభాషకు ఉచిత ప్రాధాన్యం ఉండేదేమో.

ఇంకొకవైపు దినపత్రికలు చదువుకోదగ్గ విషయాలకంటె అనవసరవిషయాలకే ప్రాధాన్యతను ఇస్తూ సమాజాన్ని తప్పుద్రోవన పెడుతున్నాయి. ఇంకొకవైపు అన్ని రంగాల్లోనూ ప్రైవేటీకరణ జాడ్యం బాగా ముదిరింది. దీనికి ప్రభుత్వం కూడా తగిన ప్రత్యామ్నాయం చూపలేక చేతులు ఎత్తేసింది. వైద్యరంగం దాదాపు ప్రైవేటు పరం అయిపోయింది. ఉద్యోగస్తుల సంఖ్య అన్ని ప్రభుత్వ శాఖల్లోనూ గణనీయంగా తగ్గిపోయింది. నిత్యావసర వస్తువుల ధరలు నిత్యం పెరుగుతూనే ఉన్నాయి. స్త్రీలపై అత్యాచారం, నేరప్రవృత్తి, రాజకీయాల్లో భయంకరమైన అవినీతి, హత్యాకాండలు పెరిగిపోయాయి. ఇవి 60 ఏళ్ళక్రితం నాటి పరిస్థితులకు

పూర్తిగా భిన్నమైనవి.

సమకాలిక సమాజాన్ని అన్ని కోణాల్లోనూ పరిశీలించి సాహిత్యరూపంలో చిత్రించవలసిన బాధ్యత రచయితపై తప్పక ఉంటుంది. కనుక పైఅంశాలు అన్నింటినీ ఏ రచయితైనా తప్పనిసరిగా గమనంలోకి తీసుకోవాలి. అభ్యుదయ దృక్పథం, శాస్త్రీయమైన విశ్లేషణ, సమకాలీనపరిస్థితుల అవగాహనలేని రచయితలు తమ రచనలకు న్యాయం చేయలేరు.


మానేపల్లి

ఈనాడు వివిధపత్రికల్లోవస్తున్న కథలుకాని, నవలలుకాని, వ్యాసాలుకాని రాస్తున్నరచయితలు ఈరోజు చదివి రేపు మరిచిపోయే స్థితిలో ఉన్న సాహిత్యాన్ని సృష్టించడం ఆరోగ్యకరమైన పరిణామం కాదు. చవకబారు సాహిత్యం రాశుల కొద్దీ తయారవుతున్నా అభ్యుదయదృక్పథం, శాస్త్రీయ విశ్లేషణలేని రచనలు అనతికాలంలోనే కాలగర్భంలోకి జారుకుంటాయి. కనుక ప్రతిరచయిత సమసమాజస్థాపనే ధ్యేయంగా రచనలు సాగించాలి. రచయితలు తమ చుట్టూ వున్న పరిస్థితులను ఆకలింపు చేసుకొని వాటికి అనుగుణంగా స్పందిస్తూ సమాజంలోని సమస్యలకు పరిష్కారమార్గం చూపించాలి. వ్యక్తిజీవితానికి, సంఘజీవితానికి పరస్పరవిరుద్ధంగా కనబడే అంశాలను, వివిధరకాల సంఘటనలను వివిధ పాత్రలద్వారా చూపిస్తూ వాటికి పరిష్కారమార్గాలు చూపగలగాలి లేదా ఒక్కొక్కసారి పరిష్కారమార్గాన్ని పాఠకునికే విడిచిపెట్టాలి. ఈ విధమైన అవగాహనతో రచనలు సాగిస్తున్న చాలామంది రచయితల్లో డా. మానేపల్లిని ప్రముఖంగా పేర్కొనవచ్చు. డా. మానేపల్లిరచనల్లో ఈ అంశాలన్నీ పుష్కలంగా కనబడతాయి. డా.మానేపల్లి ప్రముఖ ఉత్తరాంధ్ర కథా రచయిత. 1960 ప్రాంతం నుండి కథలు, కవితలు, నవలలు, విమర్శలు ఇలా అనేక ప్రక్రియల్లో రచనలు చేస్తూ ఒక చేత్తో సాహిత్య సేవ ఇంకొక చేత్తో సామాజిక సేవ చేస్తూ ఈనాటికీ రచనలు చేస్తూనే ఉన్నారు. చా.సో, కా.రా, రా.వి. శాస్త్రి వంటి గొప్ప రచయితల సాహచర్యంతో అనేక కథలు రాశారు. ఆరు కథా సంపుటాలను దాదాపు 350 కథలతో వెలువరించారు. ఆయా కథలను పరిశీలిస్తే పైన పేర్కొన్న సామాజిక స్పృహ, సాహిత్య ప్రయోజనం కలిగిన కథలు అనేకం కనబడతాయి. 'నిక్షేపంలాంటిచుట్ట', 'కైలాసానికిమెట్లు', 'యాంత్రికం', 'రాజీ', 'తల్లి', మొదలైన కథల్లో జాగ్రత్తగా పరిశీలిస్తే సమకాలీన సామాజికపరిస్థితులు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. 'నిక్షేపంలాంటిచుట్ట' కథలో ప్రైవేటు బస్సుల దుస్థితి, పేదరికం మనకు కొట్టొచ్చినట్లుకనబడుతుంది. 'యాంత్రికం' కథలో మధ్యతరగతి ప్రజాజీవితం గోచరిస్తుంది. 'కైలాసానికిమెట్లు' కథలో నిరుపేద, అయిన ఒకపిల్లవాడి జీవితం కనిపిస్తుంది. 'రాజీ', 'తల్లి' కథల్లో రెండురకాలైన స్త్రీజీవితాలు గోచరిస్తాయి. అలాగే 'వీధిగుమ్మం', 'మీవారేంచేస్తుంటారు?' 'మొదలైన కథల్లో ఇంకోరకం స్త్రీ లమనస్తత్వం కనిపిస్తుంది. సమాజం నిరంతరం పరిణమిస్తుందన్న మాటనిజమే కాని మారుతున్నపరిస్థితులు కొందరి జీవితాల్లో ఏ విధమైన మార్పులు తీసుకురాలేకపోవడం కూడా ఒక గడ్డువాస్తవికం. 'నల్లమబ్బులు' కథలో పరిస్థితులు ఈనాటికీ యథాతథంగానే ఉన్నాయి. 'మాధవరావుమాష్టారు' కథలో ఉన్న మాధవరావు ఇప్పటికీ సగటు ఉపాధ్యాయునికి ప్రతిబింబంగా నిలుస్తాడు.

'పులుసు తపేలా' కథ కార్మికుల జీవితాన్ని చూపెడుతుంది. 'ఎద్దుబ్రతుకు', 'బడ్డీకొట్టు బ్రతుకుతెరువు' మొదలైన కథలు మధ్యతరగతి జీవితంలో ఉండేసమస్యలను చూపిస్తాయి. 'ఉద్యమం సరళరేఖకాదు', 'తక్షణచర్య' మొదలైనకథలు ఉద్యమ నేపథ్యాన్ని చూపెడతాయి. 'మహాలక్ష్మిమరణం' కథ మొత్తం కథా సాహిత్యంలో మకుటాయమానంగా నిలుస్తుంది. తన జీవితమంతా ధారపోసి పిల్లలను పెంచితే చివర్లో తల్లిని వృద్ధాశ్రమంలో పెట్టి కొడుకులు చేతులు దులుపుకుంటారు. ఈ కథ చదివిన పాఠకుడు కన్నీరు పెట్టకపోతే పాషాణ హృదయుడైనట్లు లెక్క. అలాగే 'నేను తల్లినౌతాను' కథలో అంగ వైకల్యం గల ఇంద్రాణి పాత్ర పురుషునిచేత మోసగింపబడి ఇంట్లో వాళ్ళచేత చీదరించబడి చివరకు ఎలా ఎదురు నిలిచిందో తెలిపే కథ. పాఠకుని నిలబెట్టి చదివించగల కథలు అనేకం కనబడతాయి. ఇలా చెప్పుకుంటూపోతే డా.మానేపల్లిరాసిన ప్రతికథవెనుక సమాజంలో ఉండే అనేక సంఘటనలు, సంఘర్షణలు, సమస్యలు, పాత్రలు ప్రతిఫలిస్తూనే ఉంటాయి.

సాహిత్యాన్ని సామాజిక పరమైన అంశాలతో విశ్లేషించుకున్నప్పుడు మాత్రమే సమాజ శ్రేయస్సును కాంక్షించే సాహిత్యం పుట్టుకువస్తుంది. నిజమైన సాహిత్యవిమర్శకు ఈ విశ్లేషణ చాలా అవసరం. సాహిత్యప్రయోజనం వరకు వస్తే

## పలుకుల శిల్పం

❖ పిల్లా కుమారస్వామి
949012229



**భా**వం నిశ్శబ్దం లో పుట్టి
శబ్దంగా మారి సంకేతమైంది
సంకేతానికి సౌందర్యమబ్బి
భావాల ఆకృతిగా భాష వచ్చి నిలిచింది
భాష ప్రజల సమైక్య సృష్టి
ప్రకృతిలో తానొక బిందువై
సింధువుగా మారేందుకు
వెలసిన పోలికలలో వికసించిన
సౌందర్యాత్మక ధ్యానం భాష
భాష ఒకర్నొకర్ని
మరొకరిలోకి ప్రవహింపజేస్తుంది
రోబో లయినా
గ్రహాంతర వాసులైనా
భాష కోసం తహతహ లాడతారు
భాష మన ఆయువుపట్టు

## చీకటి గ్రద్ధ నెత్తిన...



❖ నెల్లిమర్ల శ్రీనివాస్
9490744576

**ప**చ్చని చెట్టుపై వాలి
వెచ్చటి ఉషోదయాన్ని మేస్తూ
తన రాబోయే తరానికై
నేడు అద్దె గర్భాన్ని
వెతుక్కుంటున్న
కోకిల కంటే......
వెలుగుకు వెలిగా
గతానికి తలకిందులుగా
వేలాడుతూ
చిక్కని రాత్రిని తాగుతున్న
గబ్బిలం కంటే.....
ఎర్రటి ఎండను తింటూ
ముల్లును ఇల్లుగా
మలుచుకుంటూ
రేపటి వేకువకై
చీకటి గ్రద్ధ నెత్తిన తన్నే
కాకి అంటే నాకిష్టం

పాఠకునిలో ఒక మానసికపరివర్తన చైతన్యం కలిగించడం ప్రధానలక్షణం. ఆలోచింపచేసి పాఠకుడిని చైతన్యపరచడం అనేది సాహిత్య పరమావధి.

ఉత్తరాంధ్రలో మహానుభావులైన 'గురజాడ', 'చా.సో', 'రా.వి. శాస్త్రి', 'కా.రా'మొదలైన నిష్ణాతులు ఈ పనిని విజయవంతంగా నిర్వహించారు. అదే వరుసలో భూషణం పేరు కూడా చెప్పుకోవాలి. అలాగే డా.మానేపల్లిని ఈ విషయంలో మెరుగైన రచయితగానే భావించవచ్చును. ఎందుకంటే మానేపల్లి కథలన్నింటిలోనూ సమాజం ప్రస్ఫుటంగా దర్శనిమిస్తూనే ఉంటుంది. మానేపల్లి గారికి వ్యక్తిగతంగా ఉద్యమ జీవితం లేదు కాని వివిధ, ప్రజా ఉద్యమాలకు సంబంధించిన అవగాహన మాత్రం పుష్కలంగా ఉంది. అందువల్ల 1960-2000 మధ్యకాలం నాటి ఉత్తరాంధ్ర సామాజిక జీవితానికి, వివిధ పరిణామాలకు ఆయన కథలు అద్దంపడతాయి. 'ఏడుపుఏరుపెక్కింది', 'దుమ్మలగొండి', 'తక్షణచర్య' మొదలైనకథల్లో రాజకీయవాసన చూడవచ్చును. 'అరచేతిలో అభ్యుదయం గాళ్ళు', 'తోటకూరతులసాకు', 'బ్రతుకుతీపి', 'చావుయాతన' మొదలైన కథల్లో చర్చించినజీవిత తాత్వికత పాఠకుడిని ఆలోచింపజేస్తుంది. 'దేవునిపై ప్రమాణంచేసి', 'మనిషికాలినవాసన', 'పుణ్యకార్యం', 'నాంచరమ్మనాగదేవత' మొదలైన కథలు కంటి ఎదురుగా జరిగిన వాస్తవిక సంఘటనలకు సాహిత్యరూపం ఇచ్చే ప్రయత్నంచేసాయి. ఆరుసంపుటాల్లోని ఏ కథా నేలవిడిచిసాము చేసింది కాదు. అన్నిటికన్నీ జీవితవాస్తవాలను విశ్లేషించి, తనకు ఎదురైన అనుభవాలను చక్కగా కథనం చేసి, చదువరుల చేత ఆలోచింపజేసే ప్రయత్నం చేసాయి.

ఆలోచన మనిషి చైతన్యానికి నిదర్శనం. ఆలోచన బయలుదేరిన చోట ఆగదు. అది తప్పక ఆచరణకు దారి తీస్తుంది. ఆచరణ జీవితాన్ని పరిపక్వం చేస్తుంది. ఇదే ఆచరణ సాంఘిక రూపం తీసుకున్నప్పుడు ఉద్యమాలు వస్తాయి. అది సాహిత్యోద్యమం కావచ్చు, సాంఘిక ఉద్యమం కావచ్చు. ఏ ఉద్యమమైనా సామాజిక జీవిత గతిని నిర్ణయిస్తుంది. ఇదే సాహిత్య ప్రయోజనానికి పరాకాష్టగా నిలుస్తుంది. కనుక సామజిక నేపథ్యంతో కూడిన రచన మాత్రమే సాహిత్య ప్రయోజనాన్ని సాధించ గలుగుతుంది. ఈ విషయంలో డా. మానేపల్లి కృతకృత్యుడైనట్లు చెప్పవచ్చును.

# సీమ సంక్షుభిత జీవన చిత్రణ

❖ డా॥ వి.ఆర్.రాసాని
9848443610




***శాంతి నారాయణ కథకులుగా, నవలాకారులుగా, కవిగా, కాలమిస్టుగా ప్రసిద్ధమైనవారు. వీరు ప్రధానంగా 'రక్తపుముద్ద పిలిచింది' (1972), 'రస్తా' (1979), 'పల్లేరు ముళ్ళు' (1999), 'నమ్ముకున్నరాజ్యం' (2004),'కొండచిలువ', (2014)అనే కథల సంపుటాలను ముద్రించారు. మాధురి (1980), 'పెన్నేటి మలుపులు' (200) వంటి నవలల్ని, 'నడిరేయి నగరం' (1978), వంటి కవితాసంపుటిని ముద్రించారు. ఇంకా 'హోరుపు' కవితా సంకలనానికి, 'ఇనుప గజ్జెల తల్లి' కథాసంకలనానికి సంపాదకత్వం కూడా వహించారు.***

"దూరంగా పొలాల చివర ఎండమావులు కనిపిస్తున్నాయి." ఎండాకాలంలో తారురోడ్ల మీద పోతుంటే ఎండమావులు కనిపిస్తాయి. లేదా ఎడారిలో పయనించే వారికి దూరంగా నీళ్ళ సరస్సులున్నట్టు 'మృగతృష్ణ'లు కనిపిస్తాయి. పచ్చదనం కనిపించని, వర్షమే పడని భూమి ఎడారి కదా. మరి అలాంటి ఎడారిలో ఎండమావులు సహజమే. కానీ పొలాలలో ఎండమావులు 'ఏమిటి? అనే అనుమానం రావచ్చు. ఎప్పుడూ కరువులతో మాడిపోయే ప్రదేశంలో, రోజురోజుకీ ఎడారిగా మారిపోతున్న ప్రాంతంలో, ఎన్నో తరాలను భూసార శక్తితో పోషించి, నేడు ఇసుక తిప్పలుగా మారిపోతున్న గడ్డలో మృగతృష్ణలు కనిపించడం సహజమే కదా. ఇలాంటి ప్రాంతం మనరాష్ట్రంలో నిజంగా వుందా అంటే వుంది. అదే రాయలసీమ. అందునా అనంతపురం జిల్లా. ఈ ప్రాంతంలో వ్యవసాయం సంక్షోభంలో పడిపోయి, జనం కడుపులు కాల్చుకుంటూ వలసలు వెళ్లిపోతున్నారు. అలాంటి రాయలసీమ జీవిత చిత్రణే ప్రధాన ధ్యేయంగా కథలు రాస్తున్న వారు డా॥ శాంతినారాయణ. వారు రాసిన 'కేసు వాయిదా పడింది' కథలో చివరి వాక్యమే 'దూరంగా పొలాల చివర ఎండమావులు కనిపిస్తున్నాయి'.

శాంతి నారాయణ కథకులుగా, నవలాకారులుగా, కవిగా, కాలమిస్టుగా ప్రసిద్ధమైనవారు. వీరు ప్రధానంగా 'రక్తపుముద్ద పిలిచింది' (1972), 'రస్తా' (1979), 'పల్లేరు ముళ్ళు' (1999), 'నమ్ముకున్న రాజ్యం' (2004), 'కొండచిలువ', (2014)అనే కథల సంపుటాలను ముద్రించారు. మాధురి (1980), 'పెన్నేటి మలుపులు' (200) వంటి నవలల్ని, 'నడిరేయి నగరం' (1978), వంటి కవితాసంపుటిని ముద్రించారు. ఇంకా 'హోరుపు' కవితా సంకలనానికి, 'ఇనుప గజ్జెల తల్లి' కథాసంకలనానికి సంపాదకత్వం కూడా వహించారు. 2006 నుంచి "విమలాశాంతి" పురస్కారం'తో ప్రతి ఏడాదీ ఉత్తమ కథకుల్ని , కవుల్ని, సత్కరిస్తున్నారు. అంతేగాక నిత్యకరువులతో, రాజకీయ నిర్లక్ష్యంతో, ఫ్యాక్షనిష్టుల దాష్టీకాలతో నిరంతరం బాధింపబడుతున్న రాయలసీమ సంక్షేమం కోసం నిరంతరం పాటుబడుతున్న వ్యక్తుల్లో శాంతి నారాయణగారు కూడా ఒకరు. అందుకే వీరి కథలన్నీ రాయలసీమ జీవితాల చుట్టూనే తిరుగుతాయి.

ఈ వందేండ్ల తెలుగు కథ మొదట బ్రాహ్మణ బాహువులనుంచీ, మధ్యతరగతి మధ్యకొచ్చింది. ఆ తర్వాత

"మీరు చెప్పుకోవలసింది చెప్పుకోవచ్చు"నని జడ్జి అడిగినప్పుడు నాగప్ప చెప్పుకున్న విన్నపం రాయలసీమ దుస్థితిని ఆవిష్కరించే ఒక నిజ పత్రం.

స్త్రీల, దళితుల, గిరిజనుల, మైనారిటీల జీవితాల్లో చొరబడింది. ఆ తర్వాత బహుజనుల బతుకుల్ని స్పృశిస్తోంది. ఈ క్రమంలో రాయలసీమ శూద్రజీవితాలను, చిత్రించడమే కార్యాన్ని సమర్ధవంతంగా సాగిస్తున్న రచయిత శాంతినారాయణగారు. వారికలం నుంచీ అక్షర రూపం దాల్చిందే ఇటీవల వెలువడిన 'కొండచిలువ' కథల సంపుటి, అందులో కథే 'కేసు వాయిదా పడింది'.

ఒకప్పుడు రాయలసీమ రత్నాల సీమగా పేరు పొందింది. ఎక్కడ చూసినా పచ్చటి పొలాలు, గొబ్బి, జక్కి వీధి నాటకం, చెక్క భజన, కోలాటం వంటి దృశ్య కళారూపాలతో గ్రామీణ జీవితం ఆనందోత్సాహాలతో ఓలలాడేది. అర్ధరాత్రి చుట్టం వచ్చినా, అన్నార్థులొచ్చినా కడుపునిండా అన్నం బెట్ట కలిగిన మానవతామూర్తులున్న గడ్డ. ప్రతి మనిషిలోను ఆత్మాభిమానం, పౌరుషం వున్న పోతుగడ్డ. అలాంటి ఈ గడ్డలో ప్రతి రైతు రాజులా బతికేవాడు. కానీ రాను రాను ఆకాశం మోసం చేస్తూ వచ్చింది. భూజలం అంతరించింది. దాంతో ప్రశాంతంగా వున్న ఈ గడ్డపైన పైకి కనిపించని బతుకు సంఘర్షణ, జీవిత పోరాటం మొదలైంది. భూములున్నా అవి వట్టిపోయిన ఆవుల్లా తయారయ్యాయి. నిత్యం కరువు. దశాబ్ధాల నుంచీ ఒకటే వొరుపు. అన్నం పెట్టే రైతే, అన్నమో రామచంద్రా అని అరిచే పరిస్థితి. ఈ స్థితిలో ఒకప్పుడు బాగా బతికిన రైతులు ఇతర ప్రాంతాలకు పనులు వెదుక్కుంటూ వలసలు వెళ్ళడమో లేదా తమ ప్రాంతంలోని 'ఏ ఫ్యాక్టరీల్లోనో కూలీలుగా మారిపోయే దుర్భర దృశ్యాలు ప్రతిచోటా కనిపిస్తాయి. పైగా ప్రపంచీకరణ ప్రభావంతో కరువు సీమలో ఏర్పాటైన కార్పొరేట్ సంస్థలు, పారిశ్రామిక వ్యవస్థలు అడ్డుగోలుగా రైతుల భూముల్ని చౌకగా కొని అవే కొండ చిలువగా మారి రైతుల ఆస్తుల్ని, రైతుల బతుకుల్ని మింగేస్తే గత్యంతరం లేక దారిదోపిడీలకు దిగజారే కష్టజీవుల బతుకు చిత్రణ 'కేసు వాయిదా పడింది' కథలో చూడవచ్చు.

నాగరాజు, ఉప్పర నాగప్ప చిన్ననాటి స్నేహితులు. బాగా చదువుకొని ఉద్యోగస్థుడై వేరే ఊరికి వెళ్ళి, ఎన్నో ఏళ్ళ తర్వాత ఆ ఊరికి వచ్చి తన పొలంలో వేరుశనగ వేసి, వానలేక చెట్లు ఎండిపోతుంటే బాధ పడుతూ కూర్చోనున్న నాగరాజును చాలా ఏళ్ళ తర్వాత నాగప్ప కొడుకు కలిసి తన తండ్రి విషయం చెప్పి వెళ్ళిపోతాడు. నాగప్ప పిచ్చి పట్టినవాడులా ఊరొదిలి వెళ్ళిపోయాడట. ఆ విషయం తెలిసిన నాగరాజు గతాన్ని తవ్వుకుంటాడు. చిన్నప్పుడు తన ప్రాణ స్నేహితుడు నాగప్ప. నాగప్ప అతని స్నేహితులు ఒక లాయరు ద్వారా కోర్టుకు లొంగిపోయారు. ఆ విషయం తెలిసి హిందూపురంలో ఉద్యోగం చేస్తున్న నాగరాజు, స్నేహితులతో కలసి అక్కడకి చేరుకున్నాడు. నలుగురు పోలీసులు ముగ్గురు మనుషుల్ని బోనెక్కించారు.. వాళ్ళూ ఒకప్పుడు రైతులే. వారిలో నాగప్ప గానీ, మరో నిందితుడు ఓబిరెడ్డి గానీ కనిపించలేదు. వాళ్ళు అమాయకులైన రైతులని డిపెన్స్ లాయర్ కొంతసేపు వాదించిన తర్వాత నాగప్పను, ఓబిరెడ్డిని బోనులో కెక్కించారు. విషయం మేమిటంటే వాళ్ళు రోడ్లో వెళ్తున్న పోలీసు కమిషనర్ కారుకు రాత్రివేళ ఆక్సిడెంట్ చేసి, అతని భార్య వంటి పైనున్న నగలని, సూట్‌కేసులో వున్న డబ్బుల్ని దోచుకున్నారన్న అభియోగం.

"మీరు చెప్పుకోవలసింది చెప్పుకోవచ్చు"నని జడ్జి అడిగినప్పుడు నాగప్ప చెప్పుకున్న విన్నపం రాయలసీమ దుస్థితిని ఆవిష్కరించే ఒక నిజ పత్రం.

"తిండి కోసరమే మేమూ తప్పుచేసినాం దేవరా" అంటూ ఆరంభించిన ఆతని వాగ్రూప పత్రావిష్కరణలో... లారీల్లో, ఇతర వాహనాల్లో వస్తువులన్నీ వ్యాపారస్తులవనీ, అవి దోచుకోవడం వల్ల సామాన్యులకు నష్టం లేదనీ, ఆ సంపాదనంతా సామాన్యులను హింసకు గురిచేసి సంపాదించినదేననీ చెబుతాడు నాగప్ప. కన్నతల్లిలా చూసుకున్న పొలం, పుట్టినూరు వదలలేక కరువు నేలలో ఆకలితో అలమటిస్తూ, అప్పుల వాళ్ళు తమ ఆడబిడ్డల్ని పంపమని అడిగినప్పుడూ, నానా హింసలకు గురిచేస్తే పట్టించుకోని ప్రభుత్వాలను, అధికారులను దుయ్యబడతాడు. మంత్రులు, ఎమ్మెల్యేలు, రౌడీలు, కాంట్రాక్టర్లు, వ్యాపారస్తులు, బస్సుల ఓనర్లు, ఫ్యాక్టరీల పేరుతో వేల ఎకరాలను లాగేస్తూ, వేల కోట్ల రుణాలను బ్యాంకుల్లో తీసుకుని ఎగొట్టే వాళ్ళను, రాజకీయాల పేరుతో వేల కోట్లు దండుకుని బినామీ పేర్లతో ఆస్తులిని కూడబెట్టే వ్యక్తుల వైనాన్ని... అన్నింటినీ ఏకరువు పెడతాడు. అలాగే అనంతపురం జిల్లాలోని రైతుల బాధల్ని వివరించి, తన కుటుంబ పోషణార్థం, పండని పొలాలున్నా బతకలేక, ఆకలి తీర్చుకోవడం కోసం దొంగతనం చేశామని

ఒప్పుకుంటాడు. నాగప్ప ఉపన్యాసంలో చేసిన ఆ విన్నపంలో రాయలసీమ ముఖ చిత్రం ఆవిష్కరింపబడింది. దుర్భరమైన రైతు జీవితాలను, దీనావస్థలను వివరించడం జరిగింది. అన్నీ విన్న జడ్జి ఏం చెప్పాలో తెలీక కేసు వాయిదా వేస్తాడు. ఈ కథలో సీమ జీవుల ఆర్తనాదం, రాజ్యహింస, వున్నోళ్ళ దోపిడీ, వాళ్ళకు తొత్తు కాసే సర్కారు పద్ధతిని ఎండగట్టడం జరిగింది. ఈ కథ కాదు. ఈ సంపుటిలో అన్ని కథలు అలాంటివే. వలసవాద మానసిక పుత్రిక ప్రపంచీకరణ అనే పెను పిశాచం. వాణిజ్య సంస్కృతి దానికి ఊపిరి. దాని ఫలితంగా మనిషి జీవితం కూడా మార్కెట్లో వస్తువై పోయింది. దానికి మానవత్వం, సెంటిమెంట్స్ అనేవి ఆమడదూరం. తద్వారా ప్రపంచ దేశాలపైన కనిపించని కర్రపెత్తనం చెలాయిస్తున్నది అమెరికా. ప్రపంచీకరణ పేరుతో ప్రపంచాన్నే ఒక మార్కెట్టుగా మార్చేసి తన పబ్బం గడుపుకుని తన బొజ్జను పెంచుకుంటోంది. ఆ దేశం ఈ గ్లోబుపైన వదలిన అతి పెద్ద అనకొండ. కొండ చిలువ గ్లోబలైజేషన్. అది గ్రామీణ జీవితాలను, ఆస్తులను ఎలా మింగేస్తోందో తెలియజేసే కథే 'కొండ చిలువ' ఇదే ఈ సంపుటికి పేరు కూడా.

**ఆ దేశం ఈ గ్లోబుపైన వదలిన అతి పెద్ద అనకొండ. కొండ చిలువ గ్లోబలైజేషన్. అది గ్రామీణ జీవితాలను, ఆస్తులను ఎలా మింగేస్తోందో తెలియజేసే కథే 'కొండ చిలువ' ఇదే ఈ సంపుటికి పేరు కూడా.**

ఈ కొండ చిలువ కథలో "భూమిని అమ్ముకోవడమంటే తల్లిని అమ్ముకోవడమే" అన్న భావన వున్న రైతు భుముల్ని మింగేసే కార్పొరేట్ కొండ చిలువకు బలైపోయిన ఓ రైతు సుబ్బారెడ్డి. పంటలే పండని ఆ ప్రాంతపు భూములకు రాంషా కంపెనీ పుణ్యమాని బాగా రేట్లు పెరిగాయి. భూమిని వదిలించుకున్నోడే మారాజు లాగా కనిపించసాగాడు. ఆ ఊరి సర్పంచ్ నాగిరెడ్డి ద్వారా సుబ్బిరెడ్డి భూముల్ని అమ్మమని రాంషావారు రాయభారం నడిపారు. కానీ సుబ్బిరెడ్డి ఇవ్వలేదు. తను పెట్టిన టమోటా పంటకు నీళ్ళొదులుదామంటే, కరెంటే రావడం లేదు. జీతగాడు పుల్లన్న త్రీఫేస్‌లో కరెంట్ సరిగా రాక 'ఎడమ కాలవ' పడిపోతోందనీ, 25 కె.వి. ట్రాన్స్‌ఫార్మర్ మార్చి 75 కె.వి. ట్రాన్స్‌ఫార్మర్ పెట్టుకోవాలంటాడు. 'పదెకరాల అప్పటమైన పొలమిది. ఊరికి అర కిలోమీటరే ఎడమ. హైవేమీదికి వెళ్ళే రోడ్డు పక్కనే అలాంటిదాన్ని వదులుకోవాలని లేదు. సుబ్బిరెడ్డికి ట్రాన్స్‌ఫార్మర్ మార్చమని ఎఇ.ని అడిగాడు. కాని రాంషా కంపెనీకి మాత్రం ఏది కోరితే అది ఏర్పాటుచేసే ఎ.ఇ. సుబ్బిరెడ్డికి సాయం చేయలేదు. పంట పోయింది. సుబ్బిరెడ్డి అప్పులపాలయ్యాడు. దాంతో 20 సంవత్సరాలుగా ఆ ఇంటినే నమ్ముకొని వున్న జీతగాడు పుల్లయ్య తన భార్య రాంషా కంపెనీలో కూలీకి వెళ్తోందనీ, నేనూ వెళ్తున్నాననీ, చెప్పి వెళ్ళిపోతాడు. దాంతో సుబ్బిరెడ్డి కుటుంబం మరింత దిగజారిపోతుంది. ఒకరోజు సుబ్బిరెడ్డి టొనుకుపోయి వస్తూ చూద్దామని రాంషా కంపెనీలోకి అడుగుపెట్టి అక్కడున్న విద్యుద్దీపాలను, జరుగుతున్న క్వారీ పనుల్లాంటివి చూసి ఆశ్చర్యపోతాడు. అక్కడ క్యాంటీను లాంటి సౌకర్యాలు గమనిస్తాడు. అక్కడ పుల్లన్న, పుల్లన్న భార్య రోజువారీ కూలీలుగా స్థిరపడి వున్నట్టు గ్రహిస్తాడు. అక్కడ 250 కె.వి. ట్రాన్స్‌ఫార్మర్‌ని కూడా చూసి ఆశ్చర్యపోతాడు. దాని పక్కనే హైవే. భార్య నగలు తాకట్టు పెట్టి వ్యవసాయం కోసం పెట్టుకుని వుంటే ఢిల్లీలో వున్న ఆ ఇంటి అల్లుడికి లివర్ వ్యాధి, ఆపరేషన్ కోసం ఆ దబ్బు వాడడం. అప్పుడే నీళ్ళు లేక టమోటా పొలం ఎండిపోవడం, అప్పుడే రాంషా రెసిడెన్షియల్ కాలేజీలో బిడ్డల చదువుకోసం ఫీజులు, పంటకొచ్చిన సపోటా చెట్లు పనికిరాకుండా వాడిపోవడం.....అన్నీ కష్టాలే. చివరికి రాంషా కంపెనీలోనే కుటుంబసభ్యులందరూ కూలీలుగా మారిపోవడం, అదే అదునుగా ఆ ఊరి ఎం.ఎల్.ఏ ఆడిన నాటకం ఫలితంగా కోట్లవిలువ చేసే తన భూమిని 80లక్షలకు ఆతని తండ్రి అమ్ముకోవడం జరుగుతుంది. అందరికళ్లలో ఆ నేల తరుణం తీరిపాయగదా' అన్న దిగులు ముసురుకుంటుంది. ఈ కథ చదివితే కళ్ళనీళ్ళు రాక తప్పదు.

కూలీలుగా మారిపోయిన రైతుల శ్రమ సౌందర్యాన్ని 'శ్రమ రసయోగం'గా చెప్పిన కథా ఈ సంపుటిలో వుంది. రచయిత ఒక రోజు ఉద్యోగస్తురాలయిన తన శ్రీమతి మాలతి ఉదయాన ఇంటి, వంట పనిలో వెంపర్లాడుతుంటే ఏమాత్రం పట్టించుకోకుండా వాకింగ్‌కు బయలుదేరి అనంతపురం టౌవునుకు మూడు మైళ్ళు దూరంలో వున్న ఎత్తయిన 'నక్కలదిన్నె'కు వెళ్ళి అక్కడున్న బండపైన శవాసనం వేసి పడుకుంటాడు. ఉదయాన, కుక్కలు పల్లి, బుక్కచెర్ల లాంటి చుట్టుపక్కల పల్లెలనుంచీ ఆ బైపాస్ రోడ్లో బేల్దారీ కూలీలు పోతూ ఎవరో చచ్చిపోయనట్టుందని అతని దగ్గరకు వెళతారు. వాళ్ళరాకతో లేచి కూర్చొని, వారితో బాటు టవునుకు

బయలుదేరుతాడు. వారిలో తన చిన్ననాటి సహోపాధ్యాయ కూడా వుంటాడు. వాళ్ళు దారిపొడుగునా, ఉన్నవాళ్ళ గురించీ, ఉద్యోగస్తుల బద్ధకాన్ని గురించీ చర్చ సాగిస్తారు. ఆ క్రమంలో వీళ్ళు 'తినింది అరక్క' వాకింగ్‌లు చేస్తారనీ, 'మాకు తినేది ఎక్కువైతే....కొంత తగ్గించుకొని మిగిలింది మాయట్లా పేదోళ్ళకు పెట్టొచ్చుగదా' అని మాట్లాడుకుంటారు. అందులో ఒక నడివయస్కురాలు 'చెయ్యాలను కుంటే ఇంట్లో పనుండదేమి సార్? ఇంట్లో పనిజేత్తే ఆడోళ్ళకు కొంత సాయంపడినట్లవతాది' అంటుంది. అలాగే రంగమ్మ యోగాసనాల గురించి చెబుతుంది. అలా వారితో నడిచి, తనయింటికి చేరుకునేటప్పటికి పక్కూరిలో టీచర్‌గా పనిచేస్తున్న మాలతి బస్సెక్కేటప్పుడు పడే అవస్థలన్నీ చూసి, సాయంత్రం ఆమె తిరిగొచ్చేటప్పటికి ఇంటిని శుభ్రంగాపెట్టి కాఫీలు, టిఫిన్లు అన్నీ ఏర్పాటు చేసిపెడతాడు రచయిత. అంతా కష్టించడంలో రసయోగాన్ని వెదుక్కున్న రచయిత కథ ఇది.

**గ్రామీణ జీవితం గడిపే అగ్రకులస్తులయినా సరే. కరువు కాటుకు బలైపోయి, ఆర్థికంగా చితికిపోయి భిక్షగాళ్ళుగా మారిపోతున్న యథార్థ వ్యధార్థ దృశ్యాన్ని మనకళ్ళ ముందుంచుతారు.**

గ్రామీణ జీవితం గడిపే అగ్రకులస్తులయినా సరే. కరువు కాటుకు బలైపోయి, ఆర్థికంగా చితికిపోయి భిక్షగాళ్ళుగా మారిపోతున్న యథార్థ వ్యధార్థ దృశ్యాన్ని మనకళ్ళ ముందుంచుతారు. 'కాలాధీనులు' కథలో శాంతినారాయణగారు.

ఓ సాయంత్రం వేళ విశాలాంధ్ర బుక్‌హౌస్‌లో కూర్చొనివున్న రచయితను గెడ్డం పెంచుకున్న ఓ పేదవ్యక్తి పదిరూపాయల భిక్షమడుగుతాడు. అతన్ని రచయిత గుర్తుపట్టి చాలా బాధ పడతాడు. అతను చిన్నప్పుడు తనకు చదువు చెప్పిన గొప్ప టీచర్ రంగనాథశాస్త్రి కొడుకని స్వామికి చెబుతాడు రచయిత. ఆ తర్వాత అతనిచ్చిన అడ్రస్‌కి వెళ్ళి అక్కడి పరిస్థితుల్ని గమనిస్తాడు. వృద్ధుడైన రంగనాథశాస్త్రి మంచానికి అతుక్కుపోయి వుంటాడు. కుటుంబం పూట తిండి కూడా జరగని పరిస్థితిలో వుంటుంది. చివరికి రచయితకు కాఫీ యిచ్చే పరిస్థితి కూడా లేని స్థితి వారిది. ఒకప్పుడు రచయిత తండ్రి ఆ శాస్త్రిగారి పొలాన్ని గుత్తకు అడిగితే పేదవాడని అవహేళన చేశాడు. ప్రస్తుతం ఆ పొలం, చేస్తున్న ఉద్యోగమూ అన్నీ తన గర్వంతో పోగొట్టుకుని దీనావస్థలో వున్నాడు. అతని పతన స్థితిని చూసి కాస్త ఆర్థిక సాయం చేసి వచ్చేస్తాడు రచయిత.

ఉన్న పొలాన్ని పాలికానికిచ్చి రియల్ ఎస్టేట్ వ్యాపారంలో దిగి బాగా డబ్బులు సంపాదించుకొని ఉన్న భూమిని అమ్మి మరో చోట పెట్టి మధ్య వర్తులమోసం వల్ల మొత్తం నష్టపోయి, ఆ బాధ భరించలేక ఇల్లొదిలిపోయిన రామకృష్ణ అనే ఓ సన్నకారు రైతు కథ. 'మోహినీ' 'మోహనం' కథ. కరువుసీమలోను రియల్‌ఎస్టేట్ మోసాలెలా సాగుతున్నాయో చిత్రించిన కథ ఇది. ప్రపంచీకరణ పెనుగొండ ప్రభావ ఫలితాన్ని ఈ కథలో చెప్పడం జరిగింది.

మానవ జీవితాలను శాసించే చలన సూత్రాలలో ఆర్థిక విషయాన్ని మించింది మరొక్కటి లేదు. ఈ అంశాన్ని తెలియజేసే కథ 'అమలినరాగాలు', అమలినరాగాలు అంటే అకల్మష అనురాగాలు అన్న అర్థంలో రాయబడిన కథ. చిన్నప్పటి నుంచీ రేవతి అంటే ఇష్టపడేవాడు శేఖర్. కానీ మంచి భూస్వామి అయిన మేనమామ మోహన్‌తో ఆమె మేనరికం వుందని అతనికిచ్చి పెండ్లి చేయాలని అందరూ అనుకుంటారు. ఆ తర్వాత శేఖర్ సాఫ్ట్‌వేర్ ఇంజనీరై ఢిల్లీకి వెళ్ళిపోతాడు. ఆ తర్వాత కర్నూలులో కోటిరూపాయల కట్నంతో పావని అనే అమ్మాయిని చూసి, ఆతనికి తెలిసినవాళ్ళింటికి వెళతాడు. అక్కడ వారి పనిమనిషిగా వున్న రేవతిని చూసి చలించిపోయి ఆమె ద్వారా వారి మామ, బావ ఆమెను వారి జీతగాడైన రాజన్నకిచ్చి మోసంతో పెండ్లి చేసేశారని తెలుసుకుంటాడు. ఆ తర్వాత ఆమె దీనగాథ విన్న శేఖర్ కట్నంగా వచ్చిన కోటిరూపాయలతో ఒక ఇండస్ట్రీని పెట్టించి ఆదుకుంటాడు. ఉదరంగా వచ్చే కట్నంతో దీనావస్థలో వున్న బతుకుల్ని బాగు చేయించవచ్చుని చెప్పిన కథ ఇది.

అలాగే కరువు సీమలో బీడు బారిన భూములవల్ల బతుకు తెరువు కోల్పోయిన రైతులు వినాయకచవితి రోజున వ్రతానికి అవసరమైన తంగెడుపూలు, జిల్లేడుకాయలు వంటి వస్తువుల్ని అమ్మి ఈవారం గడుస్తుందన్న దుస్థితికి చేరిన పరిస్థితి 'కాలంవెంట' అనే కథలో వుంది. విలువైన గ్రామీణ వారసత్వాన్ని గుర్తు చేసుకుని తన ఊరిపేదలను ఆదుకోవాలనుకునే అమెరికాలో స్థిరపడిన ఎన్.ఆర్.ఐ స్టాలిన్‌బాబు కథ 'ఒయాసిస్సులు' నీరేలేని అనంతపురం పట్టణంలో పటాటోపంగా వినాయకచవితి పండుగ చేసుకుని వినాయక నిమజ్జనం కోసం విగ్రహాలను నీళ్ళున్న చోటుకి తరలిస్తుంటే.... ఆ జనాల్లో కలిసిపోయిన భార్యాపిల్లల్ని

# భలే మంచి చౌక బేరము

❖ అనిల్ డ్యాని
9703336688



ఎవరు లెక్కకడతారు
బేల చూపుల అమాయకత్వాన్ని
చేతిలో పడిన కాసిని కూటిడబ్బులకి
పడిపోయిన రూపాయిని సాకుగా
ప్రపంచ మార్కెట్ని అద్దంలో చూపుతుంటే
డెబిట్, క్రెడిట్, బుల్, బేర్
కాగితాల్లో నుంచి కలుగుల్లోంచి
జనావాసాల్లోకి, జేబుల్లోకి దూకుతుంటే
జనానికేం తెలుసురా
అదొక మాయా ప్రపంచం
మా వీధి చివరో చిల్లర కొట్టు
దాని యజమాని వాల్ మార్టు
కూసిని పప్పులకోసం
కూరలో ఉప్పుకోసమో
క్రెడిట్ కార్డో
మెంబర్షిప్ కార్డు కోసమో
కేవైసీ పూర్తిచేసి రమ్మంటాడు
బొటనవేలున్నది
వేలుముద్ర కోసమనే నమ్మకం
ఒక్కసారిగా చెరిగిపోతుంది
సంతకం రాక పడే అవస్త చూసి
వాడంటాడు
నిజానికి నీదేశం పుట్టినప్పటినుంచి
అభివృద్ధి చెందుతున్న దేశమే కదాని
మనం ఏళ్ళ తరబడి నేర్చుకున్న పాఠం
మనకే ఒప్పచెబుతూ
ఉల్లికి రెక్కలొస్తాయి
ఊపిరి పీల్చడానికి
ఆధార్ అవసరం అయిపోతుంది
నీ ఇంటికేసిన తాళం తీయడానికీ
గుర్తింపు కార్డొకటి చూపించి
లాగిన్ అవ్వాలి
ఎవడ్రా చెప్పింది ఇక్కడ
ప్రజలున్నారని
ఇక్కడ జనం ఓట్లుగా మారి
ఓ అరశతాబ్దం దాటిపోయింది
ఇక్కడింక మిగిలింది.
మౌనంగా తలలూపే గొర్రెలే
దేశమా సరిహద్దులన్నీ దాటేసి
నిన్ను పెట్టిన తాకట్టుని మళ్ళీ
నువ్వే తిరగ రాయించుకో
నీకంటూ సొంత విలువలేనప్పుడు
సాక్షి సంతకానికి
నూట ఇరవై కోట్ల బొటనవేళ్ళని
తెగొట్టి తీసుకెళ్ళు

---

అన్వేషిస్తున్న రచయితకు, హార్ట్ ఎటాక్ వచ్చిన ప్రిన్సిపాల్‌కు పండుగ జనం అడ్డు పడడంతో ఆసుపత్రికి పోకనే మరణించాడని తెలుస్తుంది. తిండి లేకపోయిన, భక్తి లేకపోయినా వినాయక చవితి పండుగల్ని అంత ఖర్చుపెట్టి చేయాల్సిన అవసరమేమిటని ప్రశ్నించిన కథ 'దేవుడా రక్షించు నా దేశాన్ని'.

ఇక చివర ఎండకు బస్సు ప్రయాణీకులకు సోడాలమ్ముకునే బాల కార్మికుడిని బస్సు ప్రయాణీకులే మోసంచేస్తే. అతను రచయితకు చిల్లరివ్వకుండా వెళ్ళిపోవడం చిత్రింపబడింది.

కరువు అనే అనకొండలు, ప్రపంచీకరణ అనే కొండ చిలువలు కరువు సీమలోని రైతు జీవితాలను, వ్యవసాయ కూలీ కుటుంబాలను ఎలా మింగేస్తున్నాయో చెప్పే కథలే ఇవి. రాచపాళెం గారు చెప్పినట్లు ఈ కథల్లో 'కల్పన తక్కువ. వాస్తవికత ఎక్కువ'. అట్టాడ అప్పలనాయుడు సెలవిచ్చినట్టుగా ఈ కథలు 'గడ్డ కట్టిన మనుషుల్ని, ఘనీభవించినవారి అంతరంగాన్నీ' కరిగించి, ద్రవీభవింపచేస్తాయి.

కాబట్టి ప్రపంచాన్నే తన పడగనీడలోకి తెచ్చుకున్న ప్రపంచీకరణ సర్పం ఎడారి పరిణామ పథంలోకి జారుకుంటున్న సీమను ఎలా వదలడం లేదో గ్రహించాలంటే, కరువు కాటకాలతో సంక్షుభిత బతుకు ఊబిలో కూరుకుపోతున్న రాయలసీమ గ్రామీణ వ్యవస్థ అవస్థలను అర్థం చేసుకోవాలంటే 'కొండ చిలువ' కథలు చదివి తీరాల్సిందే.

# మమ్మల్ని బతకనివ్వండి....!




❖ ఎం. రమేష్ కుమార్
9492454678

“ఏటి మావా ఇది....? మానేత్తాను......మానేత్తాను. అంటావే గానీ సాయంత్రవయ్యాసరికి మళ్ళీ అటే పోతావు. పిల్లలు పెద్దోల్లవుతున్నారు.. అవసరాలు పెరుగుతన్నై.. కంపెనీలో రెక్కలు ముక్కలు సేసుకొనొచ్చి అందల సగం డబ్బులు మందుకే తగలెడతన్నావు. నీతో పాటు నేను కట్టపడతన్నాను. ఏదో నాలుగిళ్ళలో పనికొప్పుకొని అంతో ఇంతో తెత్తన్నాను. అయినా ఏటి సుకం..? కడుపుకి తిండానికి సాల్దం నేదు”. ఎప్పటిమాదిరిగా రంగి తన దండకం సాగిస్తూనే మొగుడికి అన్నం వడ్డిస్తోంది.

రాజిగాడు ఏవీ మాట్లాడకుండా అన్నం కలుపుకొంటున్నాడు.

“తాతల నాటి పెంకుటిల్లు కారిపోతందని సెప్పి పెంకు తిరగేసినాం. రిపేర్లకి బోల్డు కరుసైంది. అదెప్పుడు తీరతాదో తెలీకంటంది.ఆ వడ్డీ ఒకటి మన పేణం మీదకి పడింది. ఏదోరకంగా కానో పరకో ఓ పక్కన బెట్టి కుసింత పొదుపు సేద్దావని సూసీసరికి ఎవులికో రోగవో రొష్టో రావడం. నేదంటే ఇంకేదో అవునరం వొచ్చి ఎప్పుడివి అప్పుడే సెల్లుబాటయిపోవడం.. సివరికి మళ్ళా ఈళ్ళదగ్గర ఆళ్ళదగ్గర చేబదులు తీసుకోవలసిన రావడం...ఒక్కసారి ఆలోసించు మావా..తాగుడు మానీశావంటే ఆ డబ్బులన్నీ మిగలెయ్యొచ్చు..అప్పుతీర్సీవొచ్చు.. అప్పుతీరిపోతే తిన్నా తినకపోయినా మనింట్లో మనం పడుండొచ్చు. అడిగీవోడుండడు. అదనేకాదు. నీ ఒళ్ళు కూడా సెడిపోకుండా వుంటది. కొంచెం నా మాట పట్టించుకో మావా”. రంగి మాట్లాడుతూనే వుంది. రాజిగాడు మాటాపలుకూ లేకుండా నిశ్శబ్దంగా తినడం సాగించాడు.

రాజిగాడు కష్టజీవి. కంపెనీలో ఇద్దరి పని ఒక్కడే చేస్తాడని అందరూ అంటారు. ఏనాడూ పనికి బద్ధకించడు. వున్నంతలో పెళ్ళాం పిల్లల్ని బాగానే చూసుకొంటాడు. తాగివచ్చినా రంగి అనే మాటలకు బుర్రొంచేస్తాడు తప్ప ఎదురు తిరిగి నోరు చేసుకోడు. అన్నీ బాగానే వున్నా ఆ ఒక్క అలవాటు మాత్రం మానలేకపోతున్నాడు. ఇంక ఇదే ఆఖరు... రేపణ్ణుంచి మానేస్తానని రంగికి ఎన్నోసార్లు చెప్పాడు. ఆ మాటలన్నీ నీటి మూటలే అయ్యాయి.



తిండి మానేసిన తర్వాత నులకమంచం మీదకెక్కి తీరిగ్గా కూర్చున్నాడు. రంగికీ ఒళ్ళు మండిపోయింది.

“నేనిలా వోగుతుంటే సమాధానం సెప్పకుండా రాయిలాగా వుంటావేటి..? అడుగుతుంది నిన్నే...!” గొంతు పెంచి అడిగింది. “అబ్బ..అలాగేలేయే..నాకు నిద్రొస్తంది. పొడుకో ఇంక,” అనేసి మంచం మీద వాలిపోయాడు రాజిగాడు.

రోజూ ఇదే తంతు..తాగేసి రావడం..ఎంత మొత్తుకున్నా ఏవీ సమాధానం చెప్పకుండా తప్పించుకోడం...రంగికి అంతకంతకీ సహనం నశించిపోతోంది.

‘ఇలా వూరుకుంటే ఈ తంతు ఇలాగే జరుగుతుంది. రేపెలాగైనా తేల్చుకోవాలి. ఈ సంగతి..’ అనుకుంది.

ఆరేళ్ళ పెద్దోడు. నాలుగేళ్ళ చిన్నోడు బైట మరో నులక మంచం మీద పడి ఆదమరచి నిద్ర పోతున్నారు. రంగికి మాత్రం నిద్ర రావడం లేదు. నెమ్మదిగా బైటకొచ్చి ఆరుబైట మంచం మీద పిల్లల పక్కన చిన్న జాగా చేసుకొని కూర్చుంది.

చల్లటిగాలి వీస్తోంది. శరీరం సేదదీరుతున్నా మండిపోతున్న ఆమె మనస్సుని మాత్రం ఆ వాతావరణం చల్లబరచ లేకపోతుంది.

ఇంతలో పక్కింట్లోంచి “సంపేత్తన్నాడ్రోయ్..ఈడికేం రోగంరా నాయనోయ్..నన్నిలాగ తినేత్తన్నాడు.. ఒరే..ఏం పోయేకాలవొచ్చిందిరా నీకు”, అంటూ గట్టిగా కేకలు వినబడ్డాయి. రంగి లేవబోయి మళ్ళీ మంచంలోనే కూలబడింది. పక్కింటి పైడిబాబు తాగేసొచ్చినట్టున్నాడు. రోజూ నడిచే కథే ఇది. తాగిసొచ్చినందుకు ఆ ఇల్లాలు శివాలెత్తిపోవడం, పైడిగాడేమో చెయ్యి చేసుకోవడం..! మధ్యలోకి ఎవరైనా వెళ్తే” నా పెళ్ళాన్ని నేను కొడతాను...తిడతాను..మధ్యలో ఎవుడ్రా అడగడానికొచ్చాడు”.. అంటూ బూతులు లంకించుకుంటాడు పైడిగాడు. అందువల్ల మధ్యలోకి వెళ్ళడానికి ఎవరూ సాహసించరు.

కాసేపటికి అరుపులు చల్లబడ్డాయి. బహుశా కొట్టడానికి ఓపిక నశించి సోలిపోయుంటాడు. అనుకుంది రంగి.

‘అదే పని రాజిగాడు సేత్తే ఏం సేసేది తను..?తనకసలే పంతం. పడుదల ఎక్కువ. అణ్ణొగ్గిసి పిల్లల్ని తీసుకొని పుట్టింటికి పోయేదాన్ని కాదూ ఈపాటికి...! అనుకుంది ‘తాగేసి రాడవే గానీ ఒక్కనాడు కూడా చెయ్యి చేసుకోలేదు. అంతేగాదు ఎన్ని మాటలన్నాగానీ కిక్కురుమనడు. ఎలగుంటే ఏం నాభం. ఈడి చేత తాగుడు మానిపించనేకపోతన్నాను గదా..!” అని మళ్ళీ అనుకుని నిట్టూర్చింది. అలా అనుకోగానే ఆమెకి పోయిన కోపం మళ్ళీ తిరిగొచ్చింది. ఏది ఏవైనా ఎలాగైనా రేపు రాజిగాడి చేత పెమాణం సేయించుకోవాలి. మళ్ళీ తాగుడి జోలికెళ్ళనని పిల్లల మీద పెమాణకం సేయించుకోవాలి. అప్పుడుగానీ తన మనసు శాంతించడు..అని గట్టిగా అనుకుంది.

“మావా..ఇయ్యాల అటో ఇటో తేలిపోవాల. సమాధానం సెప్పకుండా ఎలిపోవాలని సూడక” పనికెళ్ళాడానికి సిద్ధమౌతున్న రాజిగాడితో అంది రంగి.

“ఏటే నీగోల....? విసుగ్గా అడిగాడు రాజిగాడు.

“నువ్వు తాగుడు మానేత్తనైనా మాటియ్యి...నేదంటే నన్ను పిల్లల్ని తీసుకొని పుట్టింటికి పొమ్మంటావా. అదైనా సెప్పు...”

“అబ్బ....అలాగేలేయే...మానేత్తాన్లే...”

“ఈ మాట ఎన్నిసార్లు నువ్వన్నేదు గానీ అలాక్కాదు..మన పిల్లల మీద పెమాణకం సేసి తాగుడు మానేత్తనని సెప్పు...” ఎలాగైనా ఇవాళ ఈ విషయం తేలిపోవాలన్నట్టు అడిగింది రంగి.

గిరుక్కున వెనుదిరిగాడు రాజిగాడు. గట్టిగా ఏదో అందామనుకున్నవాడల్లా రంగి కళ్ళలో కనబడుతున్న పట్టుదల గమనించి కొంచెం జంకాడు.

“మానేత్తానని సెప్తన్నా గదే..” తగ్గిపోయి అన్నాడు

“ఆ మాటలు మరొద్దు మావా.. పెమాణకం సెయ్యి ” స్థిరంగా అంది

“సరే.. నువ్వన్నట్టు గానే.. పెమాణకవే సేస్తున్నా... ఇంక

తాగన్లే..” అనేసి మళ్ళీ వెనక్కి తిరిగి చూడకుండా పోయాడు. రాజిగాడు

సాయంత్రం మందు కొట్టకుండా ఇంటికొచ్చిన మావని చూసి రంగి పరమానందపడిపోయింది. మాట నిలబెట్టుకునేలా వున్నాడని సంబరపడిపోయింది.

రాజిగాడు స్నానం చేసొచ్చి రంగిని దగ్గరకి రమ్మని పిలిచాడు.



“నువ్విలాగే రోజూ మందు కొట్టకుండా ఇంటికొత్తే అంతకన్నా నాకు పండగనేదు మావా...” నులకమంచం మీద రాజిగాడి పక్కన కూర్చుంటూ అంది రంగి.

“సరే అదటుంచి గానీ ఓ సిన్నమాట సెప్తాను.. నువ్వర్థం సేసుకోవాల... అన్నాడు. ఏంటన్నట్టు చూసింది రంగి.

“మరేంనేదే... ఇయ్యాల సాయింత్రం ఇంటికొస్తుండగా రాయుడిగారు పిలుస్తున్నారని సెప్పి పెంచలయ్య కబురు సెప్పేడు. నరేనన్జెప్పి ఎళ్ళాను. అక్కడ ఆయన మరికొంతమందితో మాట్లాడతన్నాడు. నన్ను సూడగానే రమ్మన్నాడు. ఎలచ్చన్లు దగ్గరకొచ్చేసిన సంగతి నీకు దెల్సు గదా...అన్నాడు. తెల్సన్నాను. మరి మీ అందరి సహకారం నేకపోతే ఎలాగరా...? ఇదుగో ఈళ్ళతో అదే మాట్లాడుతున్నాను. నువ్వు కూడా రేపణ్ణించి పనికి వుండిపో... ఈ నెల్రోజులు నా ఎనకే వుండాల. మీ మంచి చెడ్డలు చూసుకునే పూచీ నాది. ఎల్లుండే నామినేసన్లు...అంచేత ఇదే సెప్పడం....రేపణ్ణుంచి వుదయాన్నే వొచ్చీ...అన్జెప్పాడు...”

“నువ్వేమన్నావ్ మావా...?”

“ఏటంటానే...మన పేటోల్లు ఏ సిన్న కష్టవొచ్చినా సెప్పుకునేది ఆయనకే కదా..మనిసంత మనిసి పిలిస్తే ఎల్లకుండా ఎలా వుండగలం సెప్పు...?”

“అలగయితే ఈ నెల బత్తెం ఎక్కణ్ణుంచి వొత్తాది..? మనం తిన్నా తినకపోయినా పిల్లలికి పెట్టాల..వొడ్డీ గట్టాల..ఆ మాట్టేటి మరి..?”

“ఓసి పిచ్చిదానా...రాయుడి గార్ని అంత తక్కువ అంచనా ఏసావేటే..? చివరాఖర్లో నెల జీతానికి మరో అయిదొందలు కలిపే ఇత్తానన్నాడు. ఏ పని వొప్పజెప్పినా నేను నమ్మకంగా సేసి పెడతానని తెలుసు. వొంకలు సెప్పననీ, వొల్లొంచి పనిసేస్తాననీ తెలుసు. అందుకే నన్ను పట్టుకున్నాడు. ఆయనకిలాంటప్పుడు మాలాంటోళ్ళే గావాలే..”

“అయితే అయిదొందలు ఎగస్టా ఇస్తానన్నాడని ఆయనెనకాతల నెల్నాళ్ళు తిరగడానికొప్పుకున్నావన్నమాట.

“అదికాదే పార్టీలో తిరిగితే రోజూ ఎంతోకొంత బేటా వుంటాది. బోజనం ఎటూ పెట్టిత్తాడు. అయ్యన్నీ కాక ఎలాగూ జీతం డబ్బులు కూడా ఇచ్చేత్తానని సెప్పాడు. అలాంటప్పుడు తిరగడానికి మనకేటి నొప్పి..?”

“నువ్వలాగంటే నేనింకేటంటాను..?అయినా మావా...ఆళ్ళతో తిరిగితే రోజూ మందు కూడా పోత్తారు గదా..అమ్మమ్మో... ఆమాటే మర్సిపోయినాను. మనకే డబ్బులూ వొద్దు...బేటాలూ వొద్దు...నువ్వెళ్ళొద్దు మావా...సక్కగా కంపినీకే బో...అప్పుడే గుర్తొచ్చినట్టు ఆందోళనగా అంది రంగి.

“అదిగది...ఇప్పుడొచ్చినావు పాయింటుకి. ఈ నెల్రోజులు నన్నొగ్గీయ్యే బాబూ....ఎలచ్చన్లు అయిపోయిన రోజే ఆఖరు. ఆ మరునటి రోజు నుంచీ మందు ముట్టుకుంటే అప్పుడడుగు.”

“ఇదేటి మావా..మళ్ళా మొదటికొచ్చినావు. పిల్లల మీద ఒట్టేసినావు గదా.. మళ్ళా ఇలగ మాట్లాడతావేటి..?” చివరాఖర్న ఆయనిచ్చే డబ్బులు మొత్తం నీచేతిలోనే పెడతాను. అంతేగాదు రోజువారీ బేటా డబ్బుల్లో మిగిలిన డబ్బులు కూడా నీకే ఇత్తాను..రంగీ...రంగీ ఈ ఒక్కసారికీ మరేటనకే బాబూ. ఈ నెల్రోజులు మనిస్టారాజ్యం.. ఆతర్వాత మళ్ళీ ముట్టుకుంటే అడుగు.. మాటంటే మాటేనే.. వుదయాన్న తాగనని సెప్పాను గానీ ఎప్పణ్ణుంచని సెప్పలేదు గదా. పిల్లల మీద ఒట్టే... ఎలచ్చన్లు అయిపోయిన మర్రోజు నుంచీ మందు ముట్టను. ఈ రాజిగాడి మాటంటే మాటే...!”

రంగి ఏవనాలో తోచక తర్జన భర్జన పడింది. రాజిగాడు మాత్రం పట్టిన పట్టు వొదల్లేదు.

“రోజూ ఫ్రీ సరుకని జెప్పి ఎంత తాగేత్తావో ఏటో...? అయినా నువ్వన్నట్టు ఎలచ్చన్లుపోయాక నిజంగా మానేత్తావని గేరంటీ ఏటీ?” అనుమానాలు బైటపెట్టింది రంగి.

ఇన్ని మాటలెందుకే... రోజూ నేను తాగుతున్న మాట నిజవే గానీ ఏనాడైనా లిమిటు దాటి తాగానా...? ఎక్కడైనా పడిపోయానా..?పోనీ ఇంటికొచ్చి అడ్డదిడ్డంగా ఎప్పుడైనా మాట్టాడానా..? సెప్పు? ఇప్పుడూ అంతేనే ఇదుగో ఇదే

సెప్తన్నాను ఇనుకో..నేనేదో నువ్వు కట్టడి సేత్తన్నావనీ, గోలెడతన్నావనీ మానేత్తానండం లేదు. నువ్వు సెప్పిందాన్ని నేను కూడా బాగా ఆలోసించుకొన్నాను. ఎందుకీ లేనిపోని ఖర్చు..? అప్పులు తీర్సుకుంటే ముందుముందుకి మన ముక్కు మీద మసుందని అడిగేవాడుండడు. కానీ ఈ నెల్రోజులూ వొదిలీ..ఆళ్ళతో తిరుగుతున్నప్పుడు నేను తాగనని మడి గట్టుకక్కూర్చుంటే అంతా నవ్వుతారే.. ఇదెప్పుణ్ణుంచిరోయ్..అంటారు. అయినా మనవేం డబ్బులెట్టాలా ఏటి..? మళ్ళీ సెప్తన్నా...పిల్లల మీద ఒట్టేసాను. అంత బుద్ధి తక్కువోణ్ణి కాదు..ఎలచ్చనయిపోయిన మర్రోజు నుంచీ మందు ముట్టను".



రాజిగాడు అంతగా చెప్పిన తర్వాత రంగి మరి తర్కించడం మానేసింది.

నామినేషన్లతో ఎలక్షన్లు వూపందుకున్నాయ్.. ఇరుపక్షాలకూ హోరాహోరీగా వుంది. పూళ్ళో రోజూ ర్యాలీలు, వుపన్యాసాలతో పండగ వాతావరణం నెలకొంటోంది. ఎలక్షన్లు దగ్గరయ్యేకొద్దీ సందడి మరింత పెరుగుతోంది.

పేట జనానికి మందుకి కరువు లేదు. వెనకాల తిరిగినోళ్ళకయితే మందు, బిర్యానీ పొట్లాలు, రోజువారీ బేటాలు..లోటు లేకుండా సాగిపోతుంది. రాజిగాడు రోజూ తాగే వస్తున్నాడు. అంతో ఇంతో డబ్బులు రంగి చేతిలో పెడతన్నాడు.

ఒకరోజు మునిమాపు వేళ... పేటలో గగ్గోలు వినిపించింది. ఎవరో గుండెలు బాదుకుంటూ పరిగెడుతున్నారు. మరెవరో కేకలు పెడుతూ ఏడుస్తున్నారు. సూర్యుడు ముఖం ఎర్రగా చేసుకుంటూ కొండల్లోకి దిగిపోతున్నాడు.

రంగి సంగతేమిటో అనుకుంటూ బైటికొచ్చింది. పేటలో జనం అటూ ఇటూ హడావుడిగా పరిగెట్టడం కనిపిస్తోంది.

"రంగీ...నిలబడి సూస్తావేటి.. పెద్దాస్పటల్‌కి పదా...కల్తీ సారా తాగి మనోళ్ళు సొంగలు గక్కుకొంటూ పడిపోయినారట..

పరిస్థితి బాలేదంటన్నారు. రాజిగాణ్ణి కూడా తీస్కెళ్ళారు. పద పద.." అంటూ యెనకింటి మంగమ్మ పక్కనుంచే పరుగెత్తుతూ పోయింది.

రంగికి కాసేపు కాళ్ళు చేతులు ఆడలేదు. కాళ్ళు భూమికి దిగేసినట్టు కదలకుండా అయిపోయినయ్...గుండె బైటికే వినిపిస్తున్నట్టనిపించింది. తేరుకుని పరుగెత్తింది. 'రాజిగాడికేవీ కాగూడదు బగవంతుడా...' అనుకొంటూ శక్తి కొద్దీ పరిగెత్తింది.

అసరికే జరగాల్సింది జరిగిపోయింది.

కొంతమంది ప్రాణాలు అప్పటికే ఆరిపోయాయి. మరికొంతమంది పరిస్థితి అప్పుడే ఏవీ చెప్పలేమంటున్నారు డాక్టర్లు.

గుండెలు దడదడలాడుతుండగా హాస్పటల్లో అడుగుపెట్టింది రంగి. రాజిగాడు చనిపోయాడన్న వార్త ఆమెకు ఎదురొచ్చింది. రంగి అక్కడే కుప్పకూలిపోయింది.

***

ఆ రోజు చనిపోయినవాళ్లు పన్నెండు మంది. దాదాపు చావు దగ్గరదాకా వెళ్ళి బ్రతికి బైటపడ్డవాళ్ళు చాలామందున్నారు. చనిపోయిన వాళ్ళ కుటుంబాలకు రాయుడు గారి దగ్గర్నుంచి కొంత కొంత మొత్తంలో డబ్బులందాయి.

రోజులు గడుస్తున్నాయి. చనిపోయినవారి కుటుంబాల వాళ్ళు జరిగిన ఘోరం నుంచి ఇప్పుడిప్పుడే బైటపడి మళ్ళీ బ్రతుకు బండిని లాగడానికి సిద్ధమౌతున్నారు. కాల్తున్న కడుపుల్ని బుజ్జగించుకోలేక మండుతున్న మనసుల్ని వూరడించుకొని వెళ్ళక తప్పని పరిస్థితి వాళ్ళది. అందుకే దు:ఖాన్ని మింగి పనుల్లోకెళ్ళడానికి సిద్ధమయ్యారు.

రంగికి కంపెనీలో పనిస్తానని యజమాని కబురు చేశాడు. రంగి పరిస్థితి మాత్రం వేరేలా వుంది. ఆరోజు నుంచి రంగి మాట్లాడ్డం మానేసింది. పిచ్చిచూపులు చూస్తూ వుండిపోయింది. దగ్గరివాళ్ళంతా రకరకాలుగా చెప్పి చూశారు. గట్టిగా ఏడిస్తే ఆమెలోని బాధ కరిగి మళ్ళీ మామూలవుతుందేమో అన్న ఆశతో 'తనివితీరా ఏడవ్వే..' అన్నారు. ఆమె కంటి నుంచి ఒక్క కన్నీటి చుక్క రాలేదు. ఆమె నోటి నుండి ఒక్క మాట రాలేదు. ఆమె ఏమైపోతుందో అని అమ్మ, అయ్య, అన్న అంతా బెంగ పెట్టుకున్నారు. అల్లుడెలాగూ పోయాడు. ఇదైనా మనకు దక్కుతుందా లేదా

అని కన్నీరు మున్నీరవసాగారు. రంగిలో మాత్రం ఎలాంటి మార్పు లేదు. బలవంతంగా తినిపిస్తే నాలుగు ముద్దలు తినడం..లేదంటే ఎక్కడో శూన్యంలోకి చూస్తూ కూర్చోడం...అంతే!

మందికి పంచడానికి తక్కువ ఖర్చుతో అయిపొద్దని రాయుడే సారా కాయించినట్టు, అది కల్తీ అయి పేణాల మీదకొచ్చినట్టు కొంతమంది చెవులు కొరుక్కున్నారు.



"రాయుడి గారికి ఈ కల్తీ సారా యవ్వారం ఆయన గెలుపుకి ఏవైనా దెబ్బ కొడతాదంటావా..."?

"ఆ..గాడిదగుడ్డు..ఆయన్ననే దమ్మెవలికుంది..? అయినా నాకేటి సంబంధం....తాగడానికి డబ్బులిత్తే ఆళ్ళే కక్కుర్తిపడి కల్తీ సారా తాగి సచ్చారు. అని ఆయన తప్పుకున్నాడు గదా..! ఎవల్నని ఏం ప్రయోజనం..? మందు అలవాటు వున్నోడికి ఆ టయిముకి ఏదిచ్చినా అమృతవే గదా.. కిక్కిస్తాదంటే చాలు విసాన్ని కూడా నోట్లో వొంపేసుకొంటారు".

"నిజవే..అయినా మందుతో వచ్చే ఆదాయం నేకపోతే గవుర్మెంటే నేదు..ఇంక దాన్ని అడ్డేదెవర్లే..?" ఇలాంటి సంభాషణలు అక్కడక్కడా వినిపిస్తూనే వున్నయ్.

ఎలక్షన్లు దగ్గరకొచ్చేశాయి. ఆ రోజు పేటలో మీటింగ్. కార్యకర్తలతో అంతా హడావుడిగా వుంది. మనుషులు చచ్చిపోయిన విషాదం ఇంకా పేటని వొదల్లేదు. కానీ చుట్టూ జెండాలు పెట్టీ తోరణాలు కట్టీ పేటను ముస్తాబు చేసేరు. ఇష్టం లేని పెళ్ళి చేసుకుంటున్న పెళ్ళికూతుర్లా ముస్తాబైంది పేట.

సాయంత్రం ఆరు దాటాక మీటింగ్ మొదలైంది. తోక నాయకులు ముందుగా మాట్లాడారు. తర్వాత రాయుడు గారి ప్రసంగం మొదలైంది. ఆ మాటలు మైక్‌లో పేటంతా మార్మోగుతున్నాయి.

"మన పెభుత్వం వస్తే ఇంకా ఎన్నో పథకాలు సిద్దంగా వున్నాయ్..మేవే మీకు పని వెతికి పెడతాం. మనోళ్ళెవరూ పన్లేకుండా వుంటానికి వీల్లేదు. పించన్లు పెంచుతాం. పేదోల్లందరికీ వడ్డీకే పదిపైనల వడ్డీకే రుణాలిప్పిస్తాం..పెతి నెలా రేషను సరుకులన్నీ అందరికీ సగం ధరకే దొరికేలా చేస్తాం. ఇల్లు లేనోళ్ళందరికీ ఇళ్ళు... స్థలం లేనోళ్ళకి స్థలాలు ఇప్పిస్తాం. మీ టివీలకు కేబుల్ బిల్లు ఇకనుంచీ గవుర్మేంటే కడుతుంది." ప్రసంగం సాగుతోంది.

ఎప్పుడు లేచి పరిగెత్తిందో ఎవరూ చూళ్ళేదు..చూసేసరికి రంగి మీటింగులో జనం మధ్య నుంచి దూసుకెళ్ళిపోయి స్టేజి ముందు నిలబడుంది. ఆమె కంట్లోంచి నిప్పులు కురుస్తున్నాయ్.

"ఒరే మాదచ్చోద్...మాకెందుకురా అయ్యన్నీ...? నువ్విత్తానన్నవి ఏవీ మాకొద్దురా...మా రెక్కలు ముక్కలు సేసుకొని కట్టబడతాం. కలో గెంజో తాగి బతుకుతాం. ఏవీ లేని రోజున పస్తులుంటాం. ఇల్లు నేకపోతే చెట్టు కింద బతుకుతాం. మీ పని జరగడం కోసం..మావోళ్ళని మీ ఎనకాతల గొర్రెల్లా తిప్పుకోడం కోసం మందు పొస్తార్రా...? కల్తీ సారా తాగించి మమ్మల్ని సంపుతార్రా..? పేటకొక బ్రాందీ సాపు, వీధికొక బెల్టు సాపు పెట్టి తాగమని సెప్పి మా మొగోళ్ళని తాగుబోతుల్ని సేసి సివరాఖరికి సంపేత్తన్నారు గదరా..ఎవుర్రా ఇయ్యన్నీ ఎట్టమని అడిగేరు..? మీరేవీ ఇయ్యక్కర్లేదురా..ఈ సాపుల్ని ఎత్తేయించండ్రా సాలు.. మా బతుకులు మమ్మల్ని బతకనీయండ్రా దొంగనాయాల్లారా.." రంగి ఉప్పెనలా విరుచుకు పడుతోంది. రాయుడు ప్రసంగం మర్చిపోయి మాటలు రానట్టుగా బొమ్మలాగా నిలబడిపోయాడు. ఏం చేయాలో తోచక నిర్ఘాంతపోయి నిలబడిపోయిన కార్యకర్తలు స్పృహలో కొచ్చి ఆమెను పక్కకు లాగెయ్యడానికి ప్రయత్నించసాగారు. ఈలోపు పేటలో రంగి ఇరుగుపొరుగు వాళ్ళు ముందుకెళ్ళి ఆమెని బైటికి తీసుకొచ్చేశారు. గొడవ జరిగేలా వుందని ఆమెను అక్కణ్ణుంచి దూరంగా తీసికెళ్ళసాగారు.

రంగిలో ఆవేశం తగ్గింది. నడుస్తున్నదల్లా ఒక్కసారిగా కూలబడింది. చేతుల్తో మొహం కప్పుకొని బిగ్గరగా ఏడవసాగింది. ఆమెలో గూడు కట్టుకొని వున్న వేదన బద్దలై కన్నీటి రూపంలో బైటికొస్తోందా అన్నట్టు హృదయవిదారకంగా రోదించసాగింది. చుట్టూవున్నవాళ్ళు ఎన్నో రకాలుగా ఓదారుస్తున్నా రంగి దు:ఖం ఆగలేదు. మసక చీకటి వేళ ఆ ఏడుపు అక్కడంతా ప్రతిధ్వనిస్తున్నట్టుగా వినబడుతోంది. హృదయంలో వేదనని దాచుకొని బైటికి మామూలుగా కనబడుతున్న ఆ పేట మొత్తం రోదిస్తున్నట్టుగా అనిపిస్తోంది.



# ఖాళీ అవుతున్న మనిషి

❖ ఎమ్వీ రామిరెడ్డి
9866777870



ఆకాశం ఎలుకలా మారి
గుప్పిట్లో ఇమిడిపోయిందని
విర్రవీగుతుంటావు నువ్వు
ఒక్క క్లిక్‌తో భూగోళం మీద మూడోపాదాన్నుంచి
గ్రహాంతరసీమను పరిహసిస్తుంటావు
విశ్వమంతా వెతికి వెతికి
నిర్జనలోయల్ని నిర్బంధిస్తుంటావు
విజయగర్వం వైఫైలా
నిరంతరం నీ చుట్టూ పరిభ్రమిస్తుంటుంది
ఎదగడానికి రెక్కలు విప్పుకోవాలనీ
నడవడానికి పాదాలు తగిలించుకోవాలనీ
ఒకనొక అత్యావశ్యక మౌలికసూత్రాన్ని
నువ్వు, ప్రగాఢ విశ్వాసంతో విస్మరిస్తావు
నిరంతరాయంగా ఎర్ర రక్తకణాలు
నీ శరీరాన్ని ఖాళీ చేస్తున్న నగ్నసత్యం
నీకు లీలగానైనా తెలిసే అవకాశం లేదు
టవర్ల తరంగదైర్ఘ్యాలు తప్ప
పిలుపు దూరం నుంచి శబ్దిస్తున్న మనిషి
నీ చెవుల్ని తాకే తావు లేదు
రెండు చేతుల వేళ్లకొసల మీద
ఆగని జీవకణాల ఆత్మహత్యలు
వార్తలుగా విడుదలయ్యే వీలులేదు
ముఖపుస్తకంలో మునకలేసి
ఊపిరాడక ఉసురు తీసుకునే
గడియారాల సంఖ్య
ఎప్పటికీ లెక్క తేలదు
పంచదారగోళీల ట్వీట్లు
దేహంలో మధుమేహంలా
విస్తరిస్తున్న సంగతి
ఎక్కడా స్కానింగ్‌కు దొరకదు
రంగు రుచి వాసన లేని
చిత్రాల నగ్నత్వాన్ని
నీ ఇన్‌స్టాగ్రామ్ నాసిక పసిగట్టలేదు
నిమిషానికోసారి నువ్వు వాట్సప్పులో
లీనమవుతున్న విషయం
నడిర్ఘూము దాటినా
వెలుగులీనే అవకాశం లేదు
స్మార్ట్ యుగం సెలైన్‌లా
నీ నరాల్లోకి ఇంకిపోతున్న
పరిణామం
ఖండాంతరాల కనుసన్నల్లో
కాపలా ఉంటుంది
అంతర్జాలంలో తలకిందులుగా
వేలాడుతూ
అసహనాన్ని డౌన్‌లోడ్
చేసుకుంటున్న రహస్యం
ఏడు సముద్రాల కివతల
మర్రిచెట్టు తొర్రలోనే
భద్రంగా ఉంటుంది
శరీర కవచాలను ఛేదించుకుని
యూ ట్యూబు ద్వారా
ప్రవహిస్తున్న అంతర్యుద్ధం
ఫిరంగుల ప్రమేయం లేకుండానే
ప్రజ్వరిల్లుతుంటుంది
మొత్తంగా ఒక అత్యంతాధునిక
రూపవిశేషం
స్పృహభరితంగా నిన్ను
నిస్తేజం చేసి
నీ పాదాల కింద
భూమిని మాయం చేస్తుంది
విరుగుడు కోసం
ఒక సాఫ్ట్‌వేర్‌ను రూపొందించే
అత్యయిక సందర్భాన్ని
తడుముకుంటున్నాను
మిత్రమా, రా!
గుప్పిట విప్పి
ఆకాశాన్ని విడుదల చేద్దాం
మూడోపాదపు పాస్‌వర్డ్‌ను
హ్యాక్‌చేసి
మనిషి రెక్కల్ని పరిరక్షిద్దాం
ధూళికణాలకు వెబ్ సంకెళ్లు విడిపించి
చారెడు నేలను సృష్టించుకుందాం
ప్రాణమున్న అక్షరమాలను
విశాలంగా పరుచుకుని
వేళ్లకొసల మీద జీవనసూర్యుళ్లను
మేల్కొలుపుదాం
ఖాళీ అవుతున్న మనిషిని
రక్తమాంసాలతో పూరిద్దాం

**(ప్రకాశం జిల్లా రచయితల సంఘం స్వర్ణోత్సవాల సందర్భంగా ఒంగోలులో నిర్వహించిన కవి సమ్మేళనంలో చదివిన కవిత)**

■■■

# మహద ప్రస్థానం..

❖ తెలకపల్లి రవి



*నెహ్రూ గాంధీ భజనలో భగత్ సింగ్‌లూ నేతాజీలు కమ్యూనిస్టు యోధులూ ఇంకా ఎందరో సామాజిక సేవకులూ తెరమరుగైన మాట నిజమే. కాని అందుకు ప్రతి వ్యూహంగా మోడీ ప్రభుత్వం సర్దార్ పటేల్‌ను, నేతాజీని చూపించి నెహ్రూ లౌకిక భావాలపై దాడి చేయడం తిరోగమనమే తప్ప పురోగమనం కాదు. లౌకికతత్వం అన్న మాటను అక్రమంగా రాజ్యాంగంలో జొప్పించారని హోం మంత్రి తిట్టిపోస్తుంటే అంబేద్కర్ ఆలోచనా ధారకు న్యాయం జరిగినట్టా? లౌకికతత్వం గాక హిందూత్వాన్ని ఆయన కలలోనైనా ఆదరిస్తారా?*

బాబాసాహెబ్ అంబేద్కర్ నూట ఇరవై అయిదవ జయంతి ఉత్సవాలు ఆయన విశ్వరూప సాక్షాత్కారంలా గోచరిస్తున్నాయి. 1927లోనే వివక్షపై సుదీర్ఘ పోరాటం ప్రారంభించారు మహారాష్ట్రలోని మహద్‌లో. ఆ మహనీయ మూర్తికి విగ్రహాల స్థాపనకు, ప్రచార కార్యక్రమాలకు పాలకులు పోటీ పడుతున్నారు. తొలిసారిగా అంబేద్కర్ పుట్టిన స్థలమైన మౌ సందర్శించి మంచి పనిచేసిన ప్రధాని మోడీ కాంగ్రెస్ అంబేద్కర్‌ను మరుగుపర్చిందని ఆరోపిస్తూ ఆయన వారసత్వమంతా తమ ప్రభుత్వానిదేనని చెప్పుకున్నారు. కాంగ్రెస్ పార్టీ అసలు ఆయనకు ఒకస్థానం కల్పించింది తామేనన్నట్టు ప్రకటించుకుంది. వర్గ పోరాటాలతో పాటు సామాజిక రంగంలోనూ సమరశీలత పెంచుకునే దిశగా అడుగులేస్తున్న కమ్యూనిస్టులు అంబేద్కర్ భావాల సమగ్ర చిత్రం ఇచ్చే ప్రయత్నం చేశారు. సహజంగానే దళిత బహుజన వాద సంస్థలూ సంఘాలూ స్వచ్ఛంద సంస్థలూ సంస్కరణ వాదులూ తమ నిరంతర స్ఫూర్తిని మరోసారి తలుచుకోవడానికి ముందుకొచ్చాయి. ఇంతమందితో కలడంబేద్కరుండు... అనిపించుకుంటున్న ఆ మహనీయుని మహిత సందేశమేమిటి? మన కాలంలో దాని మహత్తర ప్రాధాన్యత ఏమిటి?

చరిత్ర ఒక పాఠ్యపుస్తకమైతే దానికి టీకా టిప్పణి కూడా చరిత్రే. మండల్ వర్సెస్ కమండల్ అన్నవారు, భీమ్ వర్సెస్ రామ్ అంటూ రథయాత్రలు నిర్వహించిన వారు ఇప్పుడు అధికారంలో వున్నారు. కేంద్రంలో ఈ ప్రభుత్వం వచ్చాక తొలి కదలిక చెన్నైలోని అంబేద్కర్ పెరియార్ స్టడీ సర్కిల్‌ను అడ్డుకోవడంతోనే మొదలైంది. అంబేద్కర్‌తో పెనవేసుకున్న హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ క్యాంపస్‌లో రోహిత్ వేముల ఆత్మార్పణతో ఆగ్రహాగ్ని ఢిల్లీలోని జెఎన్‌యులో కన్నయ్య కుమార్ అనే విద్యార్థి నాయకుని విలక్షణ ప్రసంగాలతో దేశమంతా ప్రతిధ్వనిస్తున్నది.. అంబేద్కర్ పేరిట జరిపిన ప్రత్యేక రాజ్యాంగ సభ ప్రారంభోపన్యాసంలోనే అన్నీ వేదాల్లో వున్నాయని ప్రకటించిన హోం మంత్రి రాజ్‌నాథ్ సింగ్ మాటలు ఇటీవలి జ్ఞాపకమే. రాజ్యాంగం 1949 నవంబరు18న ఆమోదం పొందితే ఆ మరుసటిరోజునే ఆర్గనైజర్‌పత్రిక విశ్వ విస్తృతమైన మనువు మార్గం దాంట్లో కాస్తయినా చోటు పొందలేదని నిరసించిన సంగతి మరింత పాత ముచ్చట. చాయ్‌వాలాగా వుండి ప్రధాని కావడం గొప్ప విషయమే గాని ఆ తర్వాత గాయ్‌వాలాగా మారడంతోనే గాయాలు మళ్లీ సలపడం మొదలైందన్నది సమకాలీన సత్యం.

ఇంతకన్నా దారుణమైన నిజాలు చెప్పుకోవచ్చు. ఇప్పటికీ మానవ మలాన్ని శుద్ధిచేసి మోసుకుపోయే వారి

సంఖ్య ప్రపంచంలోనే అత్యధికంగా వున్నది భారత్‌లో. వారు ఏదో బతుకుతెరువు కోసం గాక గొప్ప సామాజిక కర్తవ్యంగా ఆపనిచేస్తున్నారని గుజరాత్ ముఖ్యమంత్రిగా వున్న మోడీనే వ్యాఖ్యానించారు. (కర్మయోగ్-మోడీ ఉపన్యాసాల సంకలనం, 2007) 'వారు ఈ పనిచేయాలన్నది దేవుడి ఆదేశం. ఇదో ఆధ్యాత్మిక చర్యగా శతాబ్దాలుగా కొనసాగుతున్నది. వారి పూర్వీకులు మరేపనిలేకనే ఇది చేసి వుంటారని వూహించడం కష్టం..' అని కూడా సెలవిచ్చారు. హర్యానాలో దళితులను చంపినప్పుడు ప్రతి కుక్క చావుకూ సంతాపం తెల్పనవసరం లేదన్న మాజీసైన్యాధిపతి మంత్రివర్గంలో కొనసాగుతూనే వున్నారు. కనుక అడగాలంటే ప్రశ్నలు చాలా వుంటాయి గాని అంబేద్కర్ మౌలిక భావాలకూ సనాతన చాందసాలకూ హస్తిమశకాంతరం అన్న వాస్తవాన్ని గుర్తించడానికివి చాలు. హిందూరాజ్యంపై అంబేద్కర్ తిరుగుబాటు బావుటాను టైమ్స్ ఆఫ్ ఇండియా పూర్వ సంపాదకులే ప్రస్తావించారు.

**దళిత సంఘాల నాయకులు ఇప్పుడు సహజ మిత్రులుగానే గాక నికరమైన మిత్రులుగా స్వీకరిస్తున్నారు. ఇంకా దళితుల వెనకబడిన తరగతుల మహిళల భాగస్వామ్యం నాయకత్వం పెంచుకోవలసిందేనని కమ్యూనిస్టులూ గుర్తిస్తున్నారు. కాని అధికారంలో వాటా వారు ఇవ్వలేరు. పోరాట పతాకమైతే ఇవ్వగలుగుతారు. ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లు అలాటి ఒక ముఖ్యమైన పోరాట నినాదం.**

కాంగ్రెస్ హయాంలో ఆయన ఔన్నత్యం మరుగున పడిందని మోడీ ఆరోపించారు. నిజమే. నెహ్రూ గాంధీ భజనలో భగత్ సింగ్‌లూ నేతాజీలు కమ్యూనిస్టు యోధులూ ఇంకా ఎందరో సామాజిక సేవకులూ తెరమరుగైన మాట నిజమే. కాని అందుకు ప్రతి వ్యూహంగా మోడీ ప్రభుత్వం సర్దార్ పటేల్‌ను, నేతాజీని చూపించి నెహ్రూ లౌకిక భావాలపై దాడి చేయడం తిరోగమనమే తప్ప పురోగమనం కాదు. లౌకికతత్వం అన్న మాటను అక్రమంగా రాజ్యాంగంలో జొప్పించారని హోం మంత్రి తిట్టిపోస్తుంటే అంబేద్కర్ ఆలోచనా ధారకు న్యాయం జరిగినట్టా? లౌకికతత్వం గాక హిందూత్వాన్ని ఆయన కలలోనైనా ఆదరిస్తారా?

కాంగ్రెస్ నాయకులు సరే దళితులు, బడుగు బలహీన వర్గాల మంత్రజపంతోనే దశాబ్దాల తరబడి పాలన సాగించారు. ఇటీవల ఆక్స్‌ఫర్డ్ జరిపిన విస్తృత అధ్యయనంలో దేశంలోనే దళితులలో పేదరికం అవిద్య 60శాతం పైగా వున్నట్టు తేలింది. కాంగ్రెస్, తెలుగుదేశం ఇంకా ఆయా రాష్ట్రాల్లోని గత పాలకులు కాకుంటే దీనికి ఎవరు బాధ్యత వహించాలి? ఫ్యూడల్ కులాధిపత్య శక్తుల పెత్తనాలకు వారే చిరునామాగా వున్నది వాస్తవం కాదా? ఇందిరాగాంధీ హయాంలో గొర్రెలు బర్రెలు భూ పంపిణీ బ్యాంకు రుణాలు అంటూ వారిని ఆకట్టుకున్న మాట నిజమే గాని తర్వాత సరళీకరణ గరళం తెచ్చిపోసి దళితులు బలహీనులకు వున్న అవకాశాలు కూడా దెబ్బతీయడానికి ఆరంభ వాక్యం వారిదే కదా? దళిత నేతలకు కొందరికి పదవులిచ్చి ఆ పేరుతో కోట్లమందిని కుటిల రాజకీయాలకు బలిచేయడం నిజం కాదా? కమ్యూనిస్టులు కార్మికులను, వ్యవసాయ కార్మికులను సంఘటిత పర్చి పోరాటాలు ప్రారంభిస్తే గంగవెర్రులెత్తి దాడులు దుష్ప్రచారాలు చేసింది కాంగ్రెస్ నేతలు కాదా? ఇదంతా కాదనలేని చరిత్ర. వాటిని ప్రస్తావించకుండా ప్రక్షాళన చేసుకోకుండా రాహుల్‌గాంధీ ఇప్పుడు దళితులకు మళ్లీ కనెక్ట్ కావాలని ఆధునిక భాషలో చెప్పినంత మాత్రాన అంతా కరెక్ట్ అయిపోదు.

కమ్యూనిస్టులు కూడా ఇప్పుడే కదా అంబేద్కర్‌ను ఇంతగా మాట్లాడుతున్నది అని అడగొచ్చు. నిజమే. దానికి వారూ సమాధానం చెప్పుకోవలసిందే. కాని బిజెపి కాంగ్రెస్ లాటి పార్టీలకూ, వారికీ తేడాను చూడక తప్పదు. మీరట్ కేసు విచారణ సమయంలోనే 1930లో కమ్యూనిస్టులు ప్రకటించిన తొలి కార్యాచరణ ప్రణాళికలోనే కుల వివక్షపై పోరాటం, దళిత శ్రామికులను సమీకరించి పోరాడటం వంటి అంశాలున్నాయి. సుందరయ్య వంటి నాయకులు ఈ పోరాటాలలో ముందున్నారు. దోపిళ్ళను పీడనలను కుల మత చాందసాలను వారు యువజనసంఘాల ద్వారా సవాల్ చేశారు. పీడిత ప్రజలలో కొత్తకదలిక తెచ్చి వూరూరా సమీకరించి సంఘటిత పర్చింది వారేనన్నది ఎవరూ కాదనలేని సత్యం..ఆయనకూ సైద్ధాంతిక తేడాలున్నా ప్రభుత్వ యాజమాన్యం వుండాలని గట్టిగా భావించారు. బౌద్ధమత స్వీకారం తర్వాత కూడా అనుకున్న లక్ష్యాలు నెరవేరని నిరుత్సాహంలో అంబేద్కర్ తాను కమ్యూనిస్టుపార్టీలో చేరే అవకాశం వుందని సన్నిహితుడైన

## కవిత

# కలల బేహారి

❖ తమ్మెర రాధిక
9440626702

రుతు సంహారమెప్పుడో జరిగిపోయింది
ఎండల్లో వానలూ
వానా కాలపు వడగాలులూ!
వ్యాపార పవనాలు వీచడం ప్రారంభించాక
నీటినీ నింగినీ
ఆకునీ అంబరాన్ని అమ్ముకు తినడం మరిగాక
ఎడారిలో ఒయాసిస్సుని కలకన్నట్టుగా లేదూ
మనసు!
పక్షులు గూళ్ళు పెట్టడానికి
చెట్లున్నాయనెప్పుడో మర్చేపోయాయి!
ఇళ్ళల్లో వేసిన సీలింగుల్లో సర్దుకు పోతున్నాయి.
ఆదిమ కాలంలో వేసిన ఇంద్ర ధనస్సు
అకాల వర్షానికి వెలిసిపోతూ కనిపించిందాకాశంలో!
పచ్చిక బయలంతా
బరిబాత పిల్లాడిలాగా బురద గుంటలతో ప్రకృతంతా
మారుతోంది!
స్థంభించిపోయిన స్వప్నంలాగా
కరిగిపోతున్న దిగులుగా



తనని తాను కుదగట్టుకుంటూ భూమాత
కెల్లాజ్ చిత్రంలాగా అతుకులతో
దాటకూడని సరిహద్దులని నిర్మిస్తోంది!
సౌకర్యాలే స్వేచ్ఛ అనుకుంటూ
భూ మండలాన్ని
ఒంటి చేత్తో దనుమాడే మనిషి
హాలోజన్ లైట్ల వెలుగుల్లో
వెండి వెన్నెలను పారేసుకొని
అలజడీ ఆకలి కేకలకే ఆద్యంతం స్వరాలు
కూరుస్తున్నాడు.
ప్రకృతి వనరులతో మార్కెట్ మాయ చేసే
ప్రపంచ బేహారుల వ్యూహంతో
మనుగడ సాగించే మనిషి
తనను తాను కోల్పోయి
గ్లోబల్ తుఫానులకు
ఎర అవుతున్నాడు!

❖

---

గైక్వాడ్‌తో అన్నారట. ఇటీవలనే హత్యకు గురైన గోవింద పన్సారే ఈ సంగతి రాశారు! వారు పారిశుద్య కార్మికులది కర్మయోగం అనలేదు, హక్కుల కోసం కదలించి పోరాడారు. అయితే కుల వివక్షపైన సామాజిక సమస్యలపైన మరింత ఎక్కువగా పోరాటం చేసి వుండాల్సిందని బహిరంగంగానే ఆత్మ విమర్శ చేసుకుని కొత్తవేదికలతో ముందుకువచ్చారు. సబ్‌ప్లాన్, పున్నయ్య కమిషన్ వంటివాటికి కారకులయ్యారు. చాలామంది దళిత సంఘాల నాయకులు ఇప్పుడు సహజ మిత్రులుగానే గాక నికరమైన మిత్రులుగా స్వీకరిస్తున్నారు. ఇంకా దళితుల వెనకబడిన తరగతుల మహిళల భాగస్వామ్యం నాయకత్వం పెంచుకోవలసిందేనని కమ్యూనిస్టులూ గుర్తిస్తున్నారు. కాని అధికారంలో వాటా వారు ఇవ్వలేరు. పోరాట పతాకమైతే ఇవ్వగలుగుతారు. ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లు అలాటి ఒక ముఖ్యమైన పోరాట నినాదం.

ఇక్కడే అసలైన సత్యం ఒకటుంది. పాలకులు ఏదో ఒరగబెడతారని ఒకప్పుడు దళిత జన బాహుళ్యం నమ్మి మోసపోయారు. కాని ఇప్పటికీ కొందరు వారి తరపున మాట్లాడే మేధావులు ఏవో పదవులు తీసుకోవడమే రాజ్యాధికారంలో భాగమైనట్టు చెబుతుంటారు. ఇందుకోసం బిజెపితో కూడా చేతులు కలిపిన సందర్భాలు ఎలాటి ఫలితాలకు దారితీశాయో దేశమంతా చూసింది. మరికొందరు ప్రపంచీకరణలో విముక్తిని చూపిస్తున్నారు. ఇవన్నీ కూడా మంచివే గాని పాక్షికమైన ఆలోచనలు. అంబేద్కర్ ఆనాడే చెప్పినట్టు ఆర్థిక సామాజిక సమానత్వం కనీసం సాధికారత సాధించినప్పుడే రాజ్యాంగంలోని రాజకీయ హక్కులు సార్థకమవుతాయి. ఇప్పుడున్న దేశీయ ప్రపంచ పరిస్థితులలో అది ఎదురీతే. దానికి గొప్ప పోరాటం అనివార్యం. మార్టిన్ లూథర్‌కింగ్ కన్న కలకు అమెరికా ఇంకా ఎంత దూరంలో వుందో ఈ కర్మభూమి అంబేద్కర్ మహదప్రస్థాన లక్ష్యానికి అంతకన్నా దూరంగా వుంది. ఏతావాతా విగ్రహాలకు నమస్కరిస్తూనే వినాశకరవిధానాలను తిరస్కరించకపోతే వివక్ష కొత్త రూపాలు తీసుకుంటుంది. విముక్తి మిథ్యే అవుతుంది. ఆయన జీవితం 125 ఏళ్ల సందేశమూ అదే హెచ్చరికా అదే.

(ఆంధ్రజ్యోతి దినపత్రిక 22.04.2016 సౌజన్యంతో)

❖

# భావోద్వేగ అక్షరాలే భాస్వరాలు

❖కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి
9948774243




**సాహిత్య పిపాసిగా సమకాలీన సాహిత్యాన్ని ఎప్పటికప్పుడు అధ్యయనం చేస్తూ గుండెల్లో గూడుకట్టుకున్న ఎన్నో అనుభవాల్ని, ఆలోచనా మధురిమలను అక్షరాల్లో పెట్టకుండా అణచుకుంటూ వచ్చిన వీరారెడ్డి షష్టిపూర్తి దాటాకే భావాలను "భాస్వరాలు"గా వెలువరించారు.**

"కవులు కంకణ ధారులై గర్జిస్తే / అక్షరాలే తూటాలుగా మారుతాయి" అనే నమ్మకంతో సమాజంలో పేరుకుపోతున్న కుళ్ళును సమూలంగా కడిగి పారేయ్యాలనే దృఢసంకల్పంతో కలం పట్టిన కవి ఆచార్య కడారు వీరారెడ్డి. గ్రామాన్నే ఓ తరగతి గదిగా భావించి/ ప్రపంచాన్నే ఓ పాఠశాలగా ఎంచి/ ఎన్నో జీవిత సూక్ష్మాలను గ్రహించి / బ్రతుకుబాటలో పయనించి/ అష్టకష్టాలను అధిగమించి/ ఎన్నో ఒడిదుడుకులను దిగమ్రింగి / మనుగడకు బంగారు భవిష్యత్తు ఆశించి పురోగమనానికి బంగారుబాట వేయాలనే సత్‌సంకల్పంతో తన జీవితానుభవాన్ని అరగదీసి సాహిత్య సుగంధాన్ని సృష్టించిన కవీయన. ఆలస్యంగా సాహిత్యరంగంలోకి అడుగిడినా అనుభవాలతో వడగట్టిన భావవీచికలను "భాస్వరాలు"గా వెలుగు దివిటీలుగా తెలుగులో ఆవిష్కరించారు.

గతంలో ఎన్నో ఉన్నతపదవులు అలంకరించినా ప్రస్తుతం శాతవాహన విశ్వవిద్యాలయము కరీంనగర్ వైస్‌ఛాన్స్‌లర్‌గా పనిచేస్తున్నా పట్టణ నివాసిగా వుంటున్నా పల్లెతనాన్ని, రైతు జీవన నేపథ్యాన్ని మరచిపోని వాస్తవిక వాది. సాహిత్య పిపాసిగా సమకాలీన సాహిత్యాన్ని ఎప్పటికప్పుడు అధ్యయనం చేస్తూ గుండెల్లో గూడుకట్టుకున్న ఎన్నో అనుభవాల్ని, ఆలోచనా మధురిమలను అక్షరాల్లో పెట్టకుండా అణచుకుంటూ వచ్చిన వీరారెడ్డి షష్టిపూర్తి దాటాకే భావాలను "భాస్వరాలు"గా వెలువరించారు. భాస్వరాలు కవితా సంపుటిలో 61 కవితలున్నాయి. కవి వయస్సుతో పోటీపడుతూ వచ్చిన భావోద్వేగాలే భాస్వరాలు.

బడుగు బలహీన వర్గాలకు మనోస్థైర్యాన్ని కలిగించే విధంగా "బక్క పలుచని వారంతా బలహీనులు కారు/చుక్కలు చిన్నవయినా ఛేదిస్తాయి చీకటిని" అంటారు.

వృత్తిరీత్యా అధ్యాపకుడైన వీరారెడ్డి - విద్యార్థులకు వో లక్ష్యాన్ని, మార్గాన్ని చూపిస్తూ - జ్ఞానాన్ని ఆస్వాదించడమే మార్గంగాను, అందని ప్రపంచాన్ని అందుకోవాలనే జిజ్ఞాస లక్ష్యంగాను ముందుకు సాగాలంటారు. అప్పుడే కన్న వారి కలలు ఈడేరతాయి. సమాజానికి చక్కని భవిష్యత్తు యిచ్చిన వారవుతారు అంటారు. వీరారెడ్డిలో ఒక సామ్యవాది. ఒక భౌతికవాది వున్నారు గనుకే 'పరిణామ సత్యాలు' అనే కవితలో "పక్షి తాను బతికున్నప్పుడు/ ఎన్ని చీమలను తిన్నది / అదే పక్షి చనిపోయిన తరువాత/చీమలన్నీ కలసి దాన్ని తినేశాయి" అంటారు.

# అతని ఆయుధం కలం

❖మార్టూరి శ్రీరామ్ ప్రసాద్
9490455599

అసమానతలు
ముప్పేట దాడి చేస్తున్న వేళ
అతడిలో వివేకం ఉదయించింది
అసమానతలు తొలిగించేందుకు
దుష్ట భావాలను తుదముట్టించేందుకు
నడుం బిగించాడు వాడు
లోకంలో కమ్ముకున్న
అజ్ఞాన తెరలు తొలగించాలని
లోకానికి వెలుగు నివ్వాలని
తనే అక్షర సూర్యుడై వెలగాలని
తరతరాలుగా కంపులో
మునిగిన తన వారిలో
మనిషి తనాన్ని పరిమళింపచేయాలని
రోగగ్రస్త సమాజానికి
అపర ధన్వంతరియై అవతరించాడు
కలాన్నే ఆయుధంగా మలిచాడు
అక్షర ఖడ్గాన్ని సంధించాడు
మనిషితనాన్ని మేల్కొల్పేందుకు
జనవనాలలో
మానవతా పరిమళాలను పారించేందుకు
అక్షర సైన్యమై కదిలాడు.





పల్లెవాసనలు వీరిని వెంటాడుతున్నాయి గనుకనే "చదువుకోకున్నా సంస్కారం ఉన్న / కృషీవలున్ని నేను/ చదువు సంధ్యలున్నా/ కుసంస్కారిని కాను" ఆకలిదప్పులు ఎరిగిన సగటుమనిషిని నేను" అంటారు "నేను" అనే కవితలో దారి తప్పుతున్న యువతను గూర్చి బాధపడుతూ కవి "నేటి యువత" కవిత రాశారు. ఈనాటి యువత సమసమాజ నిర్మాణ నేత కావాలి కాని, తప్పటడుగులు వేస్తూ పోతే దేశానికి ముప్పు వాటిల్లుతుంది అంటూ సకాలంలో సరైన నిర్ణయం తీసుకోలేకపోతే వచ్చే అనర్థాలను సూచిస్తూ "కండలు కరిగిన తరువాత బండలెత్తలేనట్లు/ వయసుడిగిన పిదప/ చూపు ఆననట్లు/ చేతులు కాలాక/ ఆకులు పట్టుకున్నట్లు / దారి తప్పుతుంది నేటియువత/" అంటారు.

మహిళలపై జరుగుతున్న అత్యాచారాల మీద ఉగ్రుడైపోతాడు వీరారెడ్డి. "ఎవరు బాధ్యులు" అనే కవితలో సమాజానికి ఎన్నో ప్రశ్నలు సంధిస్తాడు. "మహిళలపై మగ మృగాల అత్యాచారం/ తరతరాలుగా పెట్రేగుతున్న మహాపచారం". "లిఫ్టుల్లోను, షిఫ్టుల్లోను, వయస్సుతో నిమిత్తం లేదు / అవకాశం వస్తే అవుతారు మగాళ్ళు రేపిస్టులు/... మీడియా పాఠాలు దుర్మార్గులకు ప్రయోగాలై / మొలకెత్తే మహా వృక్షాలై వేస్తాయి వెర్రితలలు" అంటూ పురుషాధముల పుర్రెలు పగులగొట్టే ధైర్యాన్ని అబలలకు నూరిపోస్తాడు కవి "అబలలు కాదు మీరు అపరకాళికా దేవతలు / మారండి మీరు మరో ఝాన్సీ లక్ష్మీబాయిలా" అంటారు

నలుగురు ఆచరించవలసిన "నగ్న వాస్తవాలు" కవితలో "మానవసంబంధాలు పెనవేసుకుంటే సుఖాలు / మానవ విలువలు మంట గలిపితే విషాదాలు / అంటారు. దురాశ పనికిరాదంటూ "స్తనం పితికితే స్రవించేవి క్షీరధారలు / కండకోసి చూస్తే కారేవి రక్తపుటేరులు / దాగివున్న దాన్ని మూకుమ్మడిగా దోచుకోవడం / దానవత్వమే కాదు వినాశనానికి వేసే దారులు" అంటారు.

ప్రతి వ్యక్తి జీవితానికి వో గమ్యం ఉంటుందని శ్రమించి సాధిస్తే అది అవుతుంది సాధ్యం అంటారు. పంతాలు పట్టింపులు పక్కన బెట్టి పదిమందికి మేలు చేస్తూ కదలడమే మానవత్వమంటారు వీరారెడ్డి. "భావానికి రూపకల్పన కవిత్వం / కవిసృష్టికి మూలభావన" అని నమ్మిన వీరారెడ్డి సాహిత్యంలో నడక మొదలెట్టాడు. "నడక" అనే కవితలో" ఇప్పుడు నీవేమిటో / నిర్ణయిస్తుంది నీ నడక / ముమ్ముందు నీవేమిటో / నిర్ణయిస్తుంది నీ దారి / నడుస్తూనే వుండు / అడ్డు వచ్చే రాళ్ళను ముళ్ళను ఎదిరిస్తూ / అనుకూలమైన దారిని వెతుక్కో / గమ్యమెంత ముఖ్యమో గమనం కూడా అంతే / అసలే వెనక్కి తిరగకు గమ్యం చేరే వరకు " అంటారు. లోన మాగి మాగి సామాజిక వాస్తవిక స్థితిగతులను ఆలోచనాత్మకంగా, ఆవేశాత్మకంగా తన దర్శనాన్ని దృక్పథాన్ని, దృష్టికోణాన్ని, విజన్నూ వెలువరించాలనుకునే వీరారెడ్డి ఒక సిద్ధాంతపరమైన, శాస్త్రీయపరమైన హేతుబద్ధమైన స్ఫూర్తితో సాహిత్య గమనాన్ని మార్చుకుంటూ గమ్యాన్ని చేరాలని ఆకాంక్షిస్తున్నాను. సాహిత్యరంగంలో ఇది తొలి అడుగైనా వెనుకడుగు వేయకుండా ముందడుగుతో ముందుకు సాగుతాడని మరెన్నో కావ్యాలు వీరి కలం నుండి జాలువారుతాయని ఆశిస్తూ అభినందిస్తున్నాను.



# స్వీకారం

## దహనం



**సాగర్ శ్రీరామకవచం**

**వెల : 80/- పేజీలు: 184**

**ప్రతులకు : 9885473934**

**జీ**విత మథనం నుండి అనుభవసారాన్ని పిండి అక్షర రూపం ఇవ్వటం ఈ దహనం నవలలో మనం చూడవచ్చు. వ్యర్థ పదాలు, వ్యర్థ వ్యాఖ్యానాలు ఇంచుకైనా ఈ నవలలో లేవు. ఈ నవల చదవక ముందు ఎలా ఉన్నామో ఈ నవల చదివిన తరువాత అలా ఉండలేము. అదే కావాలి కదా!

**- నియోగి**

## దళిత ఉద్యమ చరిత్ర



**డా॥ కత్తి పద్మారావు**

**వెల : 500/- పేజీలు: 591**

**ప్రతులకు : 08643-42840**

**ఈ** పరిశోధన రెండు సంవత్సరాలు నిరంతరంగా జరిగింది. భారతదేశంలో దళిత ఉద్యమాల పరిణామాన్ని ఒక చారిత్రక క్రమంలో ఈ పరిశోధనలో ముందుకు తీసుకురావడం జరిగింది. ఈ పరిశోధన కోసం వందలాది గ్రంథాలను పరిశీలించి చీకటి కోణంలో దాగిన అనేక అంశాలను బయటకు తీసుకురావడం జరిగింది.

**- డా॥ కత్తి పద్మారావు**

## రాతలు వాతలు



**తిర్మల్**

**వెల : 50/- పేజీలు: 74**

**ప్రతులకు : 944186514**

**మూ**డున్నర దశాబ్దాలు, ఒక రాజకీయ అనుభవం, సుదీర్ఘకాలం పాత్రికేయుడిగా ఒక ఆలోచనా సరళీ అన్నీ కలగలిపిన ఒక దృక్పథం సమకాలీన రాజకీయ వ్యవస్థపై చరిచిన వ్యంగ్య కొరడ ఈ వాతలు-సమకాలీన ప్రపంచంలో పండిన నాలుగు ఆలోచనలు ఈ రాతలు వెరసి తిర్మల్ వాతలు - రాతలు

**- జూలూరి గౌరీ శంకర్**

## బి. ఎన్. రెడ్డి



**డి.యమ్.ప్రేమావతి**

**వెల : 75/- పేజీలు: 120**

**ప్రతులకు : 0866-2436643**

**ప్రొ**ఫెసర్ జి.ఎన్. రెడ్డి విద్యార్థులకు, పరిశోధకులకూ, పర్యవేక్షకులకూ, శాఖా నిర్వాహకులకూ మాత్రమే కాదు విద్యారంగంలో ప్రతి ఒక్కరికి ప్రేమావతి రచన గీటురాయి. ఆయనది అపురూపమైన వ్యక్తిత్వం. అనుసరణీయమైన గురుత్వం, ప్రేమావతి రచనకు అందుకోండి.

**- కేతు విశ్వనాథ రెడ్డి**

## ఏలేరు తీరాన



**- ర్యాలి ప్రసాద్**

**వెల : 50/- పేజీలు: 94**

**నే**ను పుట్టి పెరిగి పీఠికాపురం చరిత్రను రేపటి తరాల వారికి అందించాలనే సత్సంకల్పంతో పీఠికాపుర వైభవం కరదీపిక నిర్మాణంతో పిఠాపురపు ఖ్యాతిని ప్రపంచానికి తెలియజేసే ప్రయత్నమే ఈ చిన్న పుస్తకం

**-ర్యాలి ప్రసాద్**

## తీతువుపిట్ట



**తిర్మల్ కవితలు**

**వెల : 50/- పేజీలు: 63**

**ప్రతులకు : 9441864514**

**తి**ర్మల్ కవిత్వంలోని జీవితం సుపరిచితంగానూ వుంటుంది; చిన్నప్పటి బెంగేదో, మనసును చుట్టేసినట్టూ వుంటుంది. "తీతువు పిట్ట' పేజీలు మూసి ఎంత దూరం వెళ్ళినా, కూత వెంటాడుతూనే వుంటుంది.

**- సతీష్ చందర్**

# అంతఃస్వరాలు

❖ బి. కళాగోపాల్
9441631029

ఆమె చచ్చిపోయింది
కాలం మసిగుడ్డపై ఊడిగం సంతకం చేస్తూ
కన్నీటి భిక్షను కడకొంగున ముడేసుకొని
సూర్యాస్తమయాలు ఇంకిన వంటింటి కిటికీలోంచి
అదృశ్య అలలా పొగ దేహానికి కుంపటి అంటించి
ఉట్టిమీద పుచ్చిన కళేబరంలా ఆమె బోలుదేహం
దుఃఖకళికలు స్రవించింది!
యుగయుగాలుగా తన పేరేమిటంటున్న ప్రతిబింబాన్ని
చిల్లుల చేదలతో బిందెల మాటున మూతులు కుట్టేస్తున్న
గిలకల బావి వెక్కిరింతలకు....
నవ్వుకుంటున్న కూడలి అవిటి విగ్రహాల ఎత్తి పొడుపులకు
జవాబివ్వలేని నిస్సహాయతలో....
ఆమె రెక్కలు రాలిన పూవులా
సంజె చుక్కల్లో కలిసిపోయింది
త్రికాలాల పొయ్యిరాళ్ళపై
నిరంతరం ఉడుకుతున్న ఆమె దేహాత్మను
గొంతునొక్కి సజీవ మరణం అంటూ ఖననం



చేస్తున్న ఛాందస జ్వాలలు!
చేస్తున్న జల్లెడ శరీరాన్ని
మరో శిలీంధ్రానికి అప్పజెప్పి
వింత జబ్బుల తలంటుతో ఆమె
గూట్లో కన్నీటి పిట్టగా ముడుచుకుంది
వివక్ష ఆంక్షల సంకెళ్ళలో
వేధింపు రావణాసురుల పడగనీడలో
ఎదగనీయని బోన్సాయ్‌లా ఆమె
చిగురు బతుకును చిదిమేశారు
ఐనా ఆమె పుడుతూనే ఉంది
అగ్నికీలలో పైకెగిసే ఫినిక్స్‌లా...
బూడిదకుప్పల నుండి ప్రాదుర్భవించే
జీవపు మొలకల్లా
పురిటిక ఏకల అంతఃస్వరాల్లో ఆమె
ప్రతిధ్వనిస్తూనే ఉంది!!



# ఏ రోజైనా

❖ సిహెచ్.వి.బృందావనరావు
9963399189

ఏరోజు కారోజే ఒక యజ్ఞ సంరంభం
ఏరోజు ఆరాటం లేకుండా, ఆటంకం లేకుండా
అవతలికి జరగదు
బ్రతుకంటే క్షణక్షణ గండాలుగా గడిచే దినాల తోరణం
కాస్త కాస్తగా జరిపే కాల సంహరణం
అమరణ రణం!
జీవితాన్ని జీవిస్తున్నట్టు కనబర్చే ప్రయత్నపు
ఒక నటనా కౌశలం
లిప్తల్నీ గంటల్నీ రోజుల్నీ నెలల్నీ
కొంచెం కొంచెంగా నెడుతున్నట్టు గడుపుతూ
రోజుకొస్త కాస్త పనిపూర్తి చేసుకుంటున్నట్లుగా
చెమటోడ్చే ఒక అభినయ విశేషం.
చితిని దగ్గర్దగ్గరకు లాక్కొచ్చే
ఒక్కో చింతనూ
పెగ్గుల కింద గుటకలుగా జారుస్తూనో
సిగరెట్టుగా కొలుస్తూ నుసిగా రాలుస్తూనో
పెండ్లాం పిల్లల్ని హింసిస్తూనో
కాలాన్ని కదిలించే యత్నమే బ్రతుకనుకుంటూ
ఆత్మవంచన చేసుకునే మనోలోకపు దివాలా
ప్రతిరోజునూ అస్తమయంలో ముంచి



ఉదయాన్నే పైకి లాగి
మళ్ళీ అస్తమయం దాకా
బ్రతుకు బట్టను ఆరేసే ప్రయాస!
సమాధానం తెలిసినా తెలియకున్నా
రాసితీరాల్సిన పరీక్షా పత్రం
నేలపై ఇమడలేక - నింగిపై ఎగరలేక
దశానిర్ధారణమూ దిశానిర్దేశనమూ లేని
ఎటు పయనమో సూచన కూడా లేని
దారపు ఆధారం కోల్పోయిన గాలిపటం
పునర్జీవన కాంక్షలేని
బండలాగుడు సంబరం
ఒక చిన్న సంతోషపు సైకతలంక మీద కూడా
క్షణం కాలూను కోనీని బురదజారుడు వ్యవహారం
ఏ రోజైనా అంతే!
కాలాన్నీ గమనాన్నీ నియంత్రించుకునే
ఎవరి రోజైనా అంతే!



# గంటేడ గౌరునాయుడి సాహిత్య పరామర్శ

❖జగదీశ్ మల్లిపురం




*గంటేడ గౌరు నాయుడి రచనలపై వ్యాసాల సంకలనం 'నాగలిజాడ' ఆవిష్కరణ దృశ్యం. చిత్రంలో ఎడమ నుండి కిన్నెర శ్రీదేవి, గంటేడ గౌరునాయుడు, చిన వీరభద్రుడు, చీకటి దివాకర్, చాగంటి తులసి, అట్టాడ అప్పల్నాయుడు, దుప్పల రవికుమార్ ఉన్నారు.*

**ఉ**త్తరాంధ్ర లో ప్రముఖ సాహిత్య సంస్థలైన శ్రీకాకుళ సాహితి,వెలుగు,సాహితీ లహరి,స్నేహకళా సాహితి, సహజ మరియు సాహితీ స్రవంతిల సంయుక్త నిర్వహణలో విజయనగరం జిల్లాపరిషత్ సమావేశ మందిరంలో మార్చి 27న "నాగలి జాడ" గంటేడ గౌరునాయుడు సాహిత్యం పై వచ్చిన విమర్శనా వ్యాస సంపుటి ఆవిష్కరణ జరిగింది. ప్రముఖ రచయిత్రి, సాహిత్య ఆకాదెమీ సభ్యురాలు చాగంటి తులసి ఆవిష్కరించగా ఈ కార్యక్రమం రోజంతా మూడు సెషన్లుగా జరిగింది.

మొదటి సెషన్ కు ఎస్.వీ.ఆర్ .కృష్ణారావు ఆహ్వానం పలుకగా చీకటి దివాకర్, (సాహితీ స్రవంతి) అధ్యక్షత వహించారు. అధ్యక్షోపన్యాసం చేస్తూ దివాకర్ "గౌరునాయుడు పలు సాహిత్య ప్రక్రియల్లో తన సృజన కొనసాగించారని, అతని సాహిత్యం నేటి సమాజానికి ఎంతో అవసరం" అని అన్నారు. "రెండు స్వప్నాలు" సెషన్‌లో గౌరునాయుడు కథమీద "పనికి తోడు పాట" సెషన్‌లో పాటమీద చర్చ వుంటుందనీ అన్నారు.

ఈ సభలో కీలకోపన్యాసం చేసిన అట్టాడ అప్పల్నాయుడు మాట్లాడుతూ గౌరునాయుడు తాను మంచి స్నేహితులమని, తాను 'పోడు పోరు' రాసే సమయానికి గౌరునాయుడు కవితలు రాస్తూ వుండేవాడని, ఆ తర్వాత్తర్వాత కథలు రాయడం మొదలు పెట్టాడని గుర్తుచేసుకున్నారు. గౌరునాయుడు సాహిత్య పరామర్శ పేరుతో అందరం కలవడం, కలిసి నేటి సామాజిక, రాజకీయ పరిస్థితుల్ని చర్చించుకోవాల్సి వుందని చెప్పారు. ఉత్తరాంధ్రను దోచుకోవడానికి బడాబడా మల్టీనేషనల్ కంపెనీలు రాజకీయ నేతలతో కలిసి కుట్ర పన్నుతున్నాయని అన్నారు. వాటిని ఎదుర్కోవడానికి ప్రజలు పోరాటాలు చేస్తున్నారన్నారు. దానికి ఉదాహరణే కాకరాపల్లి సంఘటన, సోంపేట ఘటన అని గుర్తుచేసారు. కానీ ఎందుకో కవులూ, రచయితలు మాత్రం మౌనంగా వున్నారన్నారు. ప్రజలు చేస్తున్న పోరాటాలపై రచనలు చేయకపోతే సృజనకారులు కాలానికి, ప్రజలకు భవిష్యత్‌లో సమాధానం చెప్పాల్సి వుంటుందని ఉత్తరాంధ్ర కవి,రచయితలకు హితబోధ చేసారు.

ఆ తరువాత ముఖ్య వక్తగా వాడ్రేవు చినవీరభద్రుడు మాట్లాడుతూ...ఖమ్మం జిల్లాలో ఒక పాఠశాల ఆహ్వానం మేరకు అక్కడకు పోయినపుడు పిల్లలు మండుటెండలో ఒక పాటకు నృత్యరూపకాన్ని ప్రదర్శించారని ఆ పాట "పాడుదమా స్వేచ్ఛాగీతం" అని చెప్పారు. ఆ పాటలోని వాక్యాలు నన్నెపుడూ వెంటాడుతూ వుంటాయనని గుర్తు చేసుకున్నారు. అతడి

కవిత్వం, కథ, పాట ఒక ప్రత్యేక ముద్రని కలిగి వుంటాయని చెప్పారు. ఆ తర్వాత చాగంటి తులసి గారు మాట్లాడుతూ గౌరునాయుడు రచనల పదును తానెప్పుడో పసిగట్టాననీ, ఆ గుర్తింపే అతనికి చాసో స్ఫూర్తి అవార్డుని తెచ్చిపెట్టిందని అన్నారు. అతని రచనలు ఇతర భాషల్లోకి అనువాదం కావాల్సిన అవసరం ఎంతైనా వుందని అన్నారు. రైతు జీవితం ఎక్కడ వుంటుందో ఆ భాషలోకి వెళ్లాల్సిన తక్షణ ఆవశ్యకత ఉందని అన్నారు. "నాగలిజాడ" పుస్తకాన్ని ప్రచురించిన 'సిక్కోలు బుక్ ట్రస్ట్' అధినేత దుప్పల రవికుమార్ మాట్లాడుతూ ఇది ప్రజల సంస్థ అని దీని బతికించుకోవాల్సిన అవసరం ప్రజలకే వుందని అన్నారు. చదివే అలవాటుకి దూరమైపోతున్న నేటి రోజుల్లో పుస్తకాలు ప్రచురించడమంటే చేతులు కాల్చుకునే పనిగానే భావించాలని అంటూ అదే సమయంలో పుస్తకాల్ని నేటి తరానికి పరిచయం చేయడానికి ఈ ప్రయత్నం చేస్తున్నట్టు చెప్పారు. దీని తరువాత గౌరునాయుడు గారి పాటల పుస్తకాన్ని కూడా ప్రచురించబోతున్నట్టు ప్రకటించారు.

అనంతరం రచయిత గౌరునాయుడు మాట్లాడుతూ తన పై ఇంత ప్రేమ చూపుతున్న అందరికీ కృతజ్ఞతలు తెలిపారు. మునుముందు మంచి సాహిత్యాన్ని రాయడానికి ఈ ప్రేమాభిమానాలు తనకెంతో తోడ్పడతాయని, సాహిత్య సృజన తన బాధ్యత అని పేర్కొన్నారు.

ఈ సెషన్‌కు జి.రామకృష్ణ (స్నేహకళాసాహితి) వందన సమర్పణ చేయడంతో సభముగిసి రెండో సెషన్ ప్రారంభమయ్యింది. "రెండు స్వప్నాలు" పేరుతో గౌరునాయుడు గారి కథల మీద చర్చ కొనసాగింది. ఈ సభకు బి.వి.ఏ. రామారావునాయుడు (శ్రీకాకుళం సాహితీ) గారు అధ్యక్షత వహిస్తూ గౌరునాయుడు కథలు ఈ ప్రాంత రైతు జీవితాన్ని నిబద్ధత తో రికార్డు చేసాయని అన్నారు. ఈ సభలో ముఖ్య వక్తలుగా కిన్నెర శ్రీదేవి, ప్రొఫెసర్, కుప్పం విశ్వవిద్యాలయం, ఆదిభట్ల విద్యాసాగర్ గార్లు పాల్గొన్నారు. కిన్నెర శ్రీదేవి మాట్లాడుతూ గౌరునాయుడు కథల్లో చిత్రితమైన రైతుజీవితమూ, రాయలసీమ రైతుజీవితమూ ఒకేలాంటి వేదనను, జీవన పోరాటాల్ని పట్టిస్తాయని చెప్పారు. గౌరునాయుడు గారు తన కథల ద్వారా కొన్ని ప్రశ్నలు సంధించారని అన్నారు. "నాణెం కింద చీమ" కథలో దళిత స్పృహనీ, "చొక్కాగుడ్డకోసం" కథలోని వర్గ దృక్పథాన్ని అత్యంత ప్రతిభావంతంగా చిత్రించారని ఆమె చెప్పారు.

అనంతరం ఆదిభట్ల విద్యాసాగర్ మాట్లాడుతూ ఒక రచయిత తన రచనల్లో వాస్తవాల్ని ఉన్నదున్నట్టుగా చిత్రిస్తాడని, సమస్యలకు పరిష్కారాలు చూపలేదని ఆ రచయితను నిందించడం సరికాదని అన్నారు.

భోజన విరామానంతరం ప్రారంభమైన "పనికి తోడు పాట" సభకు ఎన్.కె. పబ్లికేషన్ అధినేత ఎన్.కే.బాబు అధ్యక్షోపన్యాసం చేస్తూ గౌరునాయుడు కథల్ని "ఒక రాత్రి రెండు స్వప్నాలు" సంపుటిగా వేసే అవకాశం రావడం, సరిగ్గా అదే పుస్తకానికి పలు అవార్డులు రావడం తనకెంతో గర్వకారణమని అన్నారు. త్వరలో గౌరునాయుడి మొత్తం సాహిత్యాన్ని ఒకే పుస్తకంగా తీసుకు రాబోతున్నట్టు ప్రకటించారు. కాపీలు కావలసి వాళ్లు ముందుగా రిజర్వు చేసుకోవచ్చని ప్రకటించారు. ఈ సభలో ముఖ్యవక్తగా సనసెట్టి రాజశేఖర్ ఆత్మీయ వక్తగా మల్లిపురం జగదీశ్ పాల్గొన్నారు. సనసెట్టి తన ప్రసంగంలో గౌరునాయుడు పాటల మీద సుదీర్ఘ ప్రసంగం చేసారు. గౌరునాయుడు పాటలు ఎవరైనా సులువుగా పాడుకునేందుకు అనువుగా వుంటాయని అన్నారు. పాట నిర్మాణంలో గౌరునాయుడు ఒక ప్రత్యేక పద్ధతిని అనుసరిస్తారని పలు పాటల్ని ఉదహరించారు. ఆయన పాటల్ని దేశభక్తిగీతాలు, సామాజిక గీతాలు, లలితగీతాలుగా వర్గీకరించవచ్చని అన్నారు. అనంతరం జగదీశ్ మాట్లాడుతూ గౌరునాయుడు పాటలతో తనకు ఎనలేని సంబంధం వుందని అన్నారు. బాల్యంలో టిక్కబాయి పాఠశాలలో గౌరునాయుడి మాష్టారు పాటల తో ప్రారంభమైన తన ప్రయాణం ఇప్పటికీ కొనసాగుతోందని అన్నారు. ఆ పాటలతో ఎదిగొచ్చిన వాణ్ణని, ఆ పాటల్లోంచి నడిచొచ్చిన వాణ్నని గుర్తుచేసుకున్నారు. ఇన్నేళ్ల తన ప్రయాణానంతరం ఒక్కసారి ఆగి వెనక్కి చూస్తే గురువు గౌరునాయుడు అడుగు జాడలే కనిపిస్తాయని అన్నారు.

అనంతరం "మలితరం మాట" సభకు వెలుగు రామినాయుడు అధ్యక్షత వహించారు. ఈ సభకు నేటి తరం యువ కవులు, రచయితలు పాల్గొంటూ గౌరునాయుడు సాహిత్యం, అతని వ్యక్తిత్వం తమపై తమ రచనలపై ఎలాంటి ప్రభావం చూపాయో తెలిపారు. బాలసుధాకర మౌళి, బాలు, ఇనగంటి జానకి, మానాపురం రాజా చంద్రశేఖర్, పక్కి రవీంద్ర రెడ్డి రామకృష్ణ, చెళ్ళపిళ్ల శ్యామల, పల్లా రోహిణీ కుమార్, మొయిద శ్రీనివాస్, చందనపల్లి గోపాలరావు, బెలగాం భీమేశ్వరరావు, బెహరా ఉమామహేశ్వరరావు తదితరులు గౌరునాయుడుతో ఉన్న అనుబంధాన్ని వివరించారు.

ఈ కార్యక్రమంలో డప్పు శ్రీను, వావిలపల్లి మోహన్, ప్రధాన ఆదినారాయణ, చీకటి చంద్రికా రాణి, కిమిడి వేదవల్లి లు పాడిన గౌరునాయుడు మాష్టారి పాటలు ఆశాంతం శ్రోతలను అలరించాయి. 

## పాలకొల్లులో ఉగాది కవి సమ్మేళనం




పాలకొల్లు సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జరిగిన కవి సమ్మేళనంలో ప్రసంగిస్తున్న శాసనమండలి సభ్యులు రాము సూర్యారావు.

ప.గో. జిల్లా పాలకొల్లులో బి.వి.ఆర్.యమ్ బాలికల ఉన్నత పాఠశాలలో ఏప్రిల్ 7న ఉగాది రోజు సాహితీస్రవంతి ఆధ్వర్యంలో కవి సమ్మేళనం జరిగింది. ఈ సందర్భంగా జరిగిన సభకు సాహితీస్రవంతి పాలకొల్లు శాఖ కన్వీనర్ వలవల శ్రీరామమూర్తి అధ్యక్షులుగా వ్యవహరించారు. ఈ సభకు ముఖ్య అతిథిగా రాము సూర్యారావు, యు.టి.యఫ్ జిల్లా కార్యదర్శి మంచెం వెంకటేశ్వరరావు, ఉభయ గోదావరి జిల్లాల ఉపాధ్యాయ ఎమ్మెల్సీ సి.వి.వి. సత్యనారాయణమూర్తి, రసధుని సాహితీ సంస్థ అధ్యక్షులు వంగా నరసింహారావు, జన విజ్ఞాన వేదిక గౌరవ అధ్యక్షులు డా. వర్మ, విశ్రాంత ఎం.ఇ.ఓ. ఎల్.జి.బి. రాజు, నాటక కళాపరిషత్ ఉపాధ్యక్షులు విన్నకోట వెంకటేశ్వరరావులు అతిథులుగా విచ్చేశారు. దేశంలో రైతుల సమస్య – పరిష్కారం, విద్య, వైద్యం సామాన్యునికి అందుబాటులో లేని పరిస్థితి పరిష్కారం, మాతృమూర్తిగా, సోదరిగా, చెలియగా, బిడ్డగా, మానవ జాతి మనుగడలే పునాదిగా ఉన్న స్త్రీ – సమాజంలోని పరిస్థితులు – పరిష్కారాలు వంటి అంశాలతో కవులు తమ ఆలోచన, ఆవేదన ప్రజ్వలింపచేయాలని కవులను కోరారు. శాసన మండల సభ్యులు రాము సూర్యారావు మాట్లాడుతూ 'కవులు సామాజికాంశాలతో రచనలు చేయడం అభినందనీయం అన్నారు. ఈ కార్యక్రమంలో కవులు, కవయిత్రులు విన్నకోట వెంకటలక్ష్మీప్రసన్న, చేగొండి రంగారావు, ఎస్.వి.ఐ. మూర్తి, తిరుపతిరాజు, కొట్టు భాస్కరరావు, నరసింహరాజు, కె.ఎమ్. కృష్ణప్రసాద్, తాళాబత్తుల గాంధీ, పి.జి.కే. గోఖలే మొదలైన వారు పాల్గొన్నారు. యస్.వి.ఐ. మూర్తి 'దేశమును ప్రేమించుమన్నా" అనే గురజాడ దేశభక్తి గేయంతో సభా కార్యక్రమం ప్రారంభ మయ్యింది. వి.వి. సత్యనారాయణమూర్తి రాగ, తాళయుతముగా పద్యాలను ఆలపించి శ్రోతలను అలరించారు. వందన సమర్పణ యర్రా అజయ్‌కుమార్ చేశారు.

**–వలవల శ్రీరామమూర్తి,**
కన్వీనర్ సాహితీ స్రవంతి, పాలకొల్లు

## హైదరాబాద్‌లో ఉగాది కవి సమ్మేళనం

తెలంగాణ సాహితి ఆధ్వర్యంలో ఏప్రిల్ 11న జరిగిన శ్రీ దుర్ముఖి నామ సంవత్సర ఉగాది




హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగిన ఉగాది కవి సమ్మేళనంలో ప్రసంగిస్తున్న ప్రముఖ సాహితీవేత్త మోతుకూరి నరహరి. చిత్రంలో భూపతి వెంకటేశ్వర్లు, సలీమా, తంగిరాల చక్రవర్తి ఉన్నారు.

కవి సమ్మేళనం సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నిర్వ హించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన మోతుకూరి నరహరి మాట్లాడుతూ ఉగాది పండుగ విశిష్టతను వివరించారు. దేశంలో రోజూ జరుగుతున్న పరిణామాలను ఉదహరిస్తూ ఉగాది పండుగ సందర్భంగా వాటిని ఎలా ఎదుర్కోవాలో ఉగాది పచ్చడితో పోల్చి వివరించారు. ఈ కార్యక్రమానికి తెలంగాణ సాహితి హైదరాబాద్ నరగ కమిటీ సభ్యురాలు సలీమా అధ్యక్షత వహించగా ,తెలంగాణ సాహితి హైదరాబాద్ నగర కమిటీ అధ్యక్షులు తంగిరాల చక్రవర్తి కవిసమ్మేళనం నిర్వహించారు. కవులు తమ స్వీయ కవితలు చదివి వినిపించారు. కవులందరిని ప్రశంసా పత్రాలతో సత్కరించారు. ఈ కార్యక్రమంలో తెలంగాణ సాహితి హైదరాబాద్ నరగ కమిటీ కార్యదర్శి యాదగిరి రావు,అనంతోజు మోహన్ కృష్ణ, మహేష్ దుర్గే, నరేష్, ఆలువాల సురేష్, పొత్తూరి సుబ్బారావు,రజనీ గంగాధర్, కందేపీ రాణీ ప్రసాద్,సాధనాల తదితరులు పాల్గొన్నారు.



# అనంతపురం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో కథ, కవిత శిక్షణా శిబిరం



అనంతపురం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఏప్రిల్ 17న నిర్వహించిన కథ, కవిత శిక్షణా శిబిరంలో ప్రసంగిస్తున్న ప్రముఖ కథారచయిత, విమర్శకులు సింగమనేని నారాయణ. చిత్రంలో అనంతపురం జిల్లా సాహితీస్రవంతి కార్యదర్శి, కుమారస్వామి, సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు తదితరులు.

అనంతపూర్‌లో ఏప్రిల్ 17న స్థానిక ప్రజావైద్యశాల వెనుకనున్న అనంతపూర్ స్టడీసర్కిల్‌లో సాహితీస్రవంతి జిల్లా, నగర కమిటీలు సంయుక్తంగా నిర్వహించిన సాహిత్యశాలలలో ప్రముఖ రచయితలు సింగమనేని నారాయణ, మల్లెల నరశింహమూర్తి, బండి నారాయణ స్వామి, రాధేయ, జంధ్యాల రఘుబాబు, శశికళ, అతిధులుగా హాజరయ్యారు. పూర్తిరోజు జరిగిన ఈ సాహిత్యశాలకు అధ్యక్షులుగా వై. సూర్యనారా యణ రెడ్డి (నగర అధ్యక్షులు), ప్రజ్ఞా సురేష్ ఆచార్యులుగా వ్యవహరించారు. సింగమనేని నారాయణ రాయలసీమ కథాచిత్రము గురించి ప్రసంగించారు. కథలు వ్రాసేవారు ముందుగా ప్రసిద్ధ కథలను చదవాలన్నారు. ముఖ్యంగా మార్క్సిస్టు దృక్పథాన్ని అలవరుచుకొవాలన్నారు. ప్రతి విషయాన్ని చారిత్రిక గమనంలో చూడాలన్నారు. సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటి సభ్యులు కుమారస్వామి సాహిత్య పరిణామక్రమాన్ని వివరించారు.

సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి రఘుబాబు మాట్లాడుతూ రాయలసీమ లో వేమన, బ్రహ్మంగారు, అన్నమయ్య ప్రసిద్ధకవులని పేర్కొన్నారు. రాయలసీమలో ముఖ్యంగా అనంతపురం వామపక్ష రాజకీయాలకు పెట్టింది పేరని చెప్పారు. నేటి రచయతలు సింగమనేని, రాచపాలెం మొదలైన వారంతా మార్క్సిస్టు దృక్పథంతో రాస్తున్న రచయతలని, వారి నుంచి యువ రచయితలు అనేక అంశాలు తెలుసుకునే అవకాశం ఉందని అన్నారు. కథా రచయిత్రి శశికళ కొన్ని కథ లను చెప్పి కథలెలా రాస్తారో వుదహరించారు. చిన్నపిల్లల కథలు కొన్ని వినిపించి పిల్లలకు వుత్సాహాన్ని కలిగించారు. బండి నారాయణ స్వామి తన చావుకూడు కథను చెప్పారు. కథలో సంఘటలన్నీ ఒక చోట నుంచే తీసుకోలేదని వేరు వేరు ప్రాంతాలలో జరిగిన వాటిని కలిపి ఒక కథగా రాసానని అయన వివరించారు. కవితా వస్తువును ఎలా గుర్తించాలో ప్రముఖ కవి రాధేయ వివరించారు. మన చుట్టూ వున్న సమాజమే మనకు కవితా వస్తువును అందిస్తుందని ఆయన అన్నారు. రాసిన కవితను పలు మార్లు దిద్దుకోవాలని ఆయన చెప్పారు. కవితా శిల్పాన్నిగురించి ప్రముఖ కవి మల్లెల నరసింహమూర్తి వివరించారు. శిల్పము, వస్తువు కవిత్వానికి రెండు రథ చక్రాల్లాంటివని అన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి సభ్యులు, ఆర్ట్స్ కళాశాల తెలుగు విభాగం ఆచార్యులు శ్రీధర్ నాయుడు, నగర కమిటీ సభ్యులు యమున, ఇదయితుల్లా, పలువురు అధ్యాపకులు, విద్యార్థులు పాల్గొన్నారు.

**జిల్లా నూతన కమిటీ ఎన్నిక:**

సాహితీ స్రవంతి జిల్లా నూతన కమిటీని ఎకగ్రీవంగా ఎన్నుకున్నారు. గతంలో అధ్యక్ష, కార్యదర్శులుగా ఉన్న కుమార స్వామి, సురేష్ ఆధ్వర్యంలో కమిటీ ఎన్నిక జరిగింది. జిల్లా నూతన కమిటీ అధ్యక్షులుగా ఎం. ప్రగతి, ప్రధాన కార్యదర్శిగా వి. రవిచంద్రకుమార్, ఉపాధ్యాక్షులుగా సత్యనిర్ధారణ్, అశ్వర్ధనారాయణ, సత్యనారాయణ, కార్యదర్శులుగా నీరుగంటి వెంకటేష్, ఇంటికింటి మహేష్, పిళ్లా కుమారస్వామిరెడ్డి, సభ్యులు నాగేంద్ర, తిప్పేస్వామి, నర్శిరెడ్డి, లక్ష్మీనారాయణ, గంగాదేవి, దరిత్రీదేవి, హిదయతుల్లా, బుడేన్‌బాబు, శ్రీధర్‌నాయుడు, రసూల్, చంద్రశేఖర్, యమునను ఎన్నుకున్నారు. ❖



సాహితీ స్రవంతి, జనవిజ్ఞాన వేదికల ఆధ్వర్యంలో ఏప్రిల్ 2న జరిగిన ప్రముఖ రచయిత శశిశ్రీ ప్రథమ వర్ధంతి దృశ్యం. చిత్రంలో ఎ. రఘునాధ రెడ్డి, మస్తాన్‌వలి తదితరులు.



విజయనగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఏప్రిల్ 7న జరిగిన ఉగాది కవి సమ్మేళనం. చిత్రంలో చంద్రికారాణి, పి.ఎస్. శ్రీనివాస్, బాల సుధాకర్ మౌళి. పాట పాడుతున్న సుష్మ



అనంతపురం జిల్లా కదిరిలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఉగాది రోజు జరిగిన ఉగాది జనకవనంలో ప్రసంగిస్తున్న కుమారస్వామి. చిత్రంలో ఎం.ఇ.ఓ. చెన్న కృష్ణ, సాహితీస్రవంతి కదిరి కార్యదర్శి చిన్నారావు ఉన్నారు.



నిజామబాద్‌లో ఉగాది రోజున జరిగిన 'సాహిత్య ప్రసూన' మాస పత్రిక ఆవిష్కరణ సభ. చిత్రంలో నాళేశ్వరం శంకరం, సూర్యప్రకాశ్, మాజీ ఎంపి. నారాయణరెడ్డి, మేకా రామస్వామి, పొత్తూరి సుబ్బారావు తదితరులు.

## ఇల్లెందులో ఉగాది కవి సమ్మేళనం

భూగర్భజలాలు ఇంకిపోతున్నట్లే సాహిత్య సాంస్కృతిక ఆస్వాదన సైతం ఇంకిపోతుందని తెలంగాణ సాహితి రాష్ట్ర కన్వీనర్ కె.ఆనందాచారి అన్నారు. సమాజాన్ని కదిలించేది కవులేనని సింగరేణి జనరల్ మేనేజర్ వై.రాజేశ్వర్ రెడ్డి అన్నారు. ఏప్రల్ 7న ఇల్లెందు సింగరేణి ఉన్నత పాఠశాలలో జరిగిన దుర్ముఖి ఉగాది కవి సమ్మేళనంలో ముఖ్య అతిథులుగా పాల్గొని ప్రసంగించారు. తెలంగాణ సాహితీ ఇల్లందు శాఖ ఆధ్వర్యంలో సాగిన కవి సమ్మేళనంలో పలువురు కవులు సామాజిక ఆర్థిక రాజకీయ అంశాలపై తమ కవితా శరాలను సంధించారు. దుర్ముఖి నామ సంవత్సరానికి కవితాక్షరాలతో స్వాగతం పలికారు. తెలంగాణ సాహితి ఖమ్మం జిల్లా ఉపాధ్యక్షులు కటుకోర్యుల రమేష్ అధ్యక్షతన జరిగిన ఉగాది కవితలు పాటలు పలువుర్ని ఆకట్టుకున్నాయి. కార్యక్రమంలో సాహితీ ప్రియులు సస్యశ్రీ, జయవాసు, వీరన్న, కృష్ణయ్య, భిక్షపతి,స్వామి, సుందర్, సంతోష్, విజయలక్ష్మి, సూర్యకుమారి తదితరులు పాల్గొన్నారు.

## 'పారేయాల్సిందే' ఆవిష్కరణ



'పారేయాల్సిందే' వచన కవితా సంపుటి ఆవిష్కరణ దృశ్యం

హైదరాబాద్‌లో ఏప్రిల్ 4న త్యాగరాయ గాన సభ కళావెంకట సుబ్బారావు కళావేదిక త్యాగరాయగాన సభ, సనాతన సాహిత్యపరిషత్‌ల సంయుక్తాధ్వర్యంలో కవి నూతలపాటి వెంకట రత్నశర్మ రచించి ప్రచురించిన "పారెయ్యాల్సిందే' వచనా కవితా సంపుటి ఆవిష్కరణ జరిగింది. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథి, గ్రంధావిష్కర్త కె. శివారెడ్డి తో పాటుగా సభాధ్యక్షుడు డా॥ టి. గౌరీశంకర్, డా॥ మసనచెన్నప్ప, కవి శిఖామణి, త్యాగరాయగాన సభ అధ్యక్షులు డా॥ కళావెంకట దీక్షితులు తెలుగు విశ్వవిద్యాలయం అసిస్టెంటు ప్రొఫెసర్ డా॥ రాధా సారంగ పాణి, కోసూరు నాగ బ్రహ్మానందం, సనాతన సాహిత్య పరిషత్ అధ్యక్షులు బాణాల మల్లికార్జున రావు తదితరులు పాల్గొన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# గుడిపాటి వెంకటచలం

19.05.1894 - 04.05.1979



చలం సాహిత్యానికి కేంద్ర బిందువు స్త్రీ. స్త్రీ, ప్రేమలేఖలు, మ్యూజింగ్స్ లాంటి వ్యాస సంపుటాలు, ఓ పువ్వు పూసింది, కన్నీటి కాలవ లాంటి కథలు, మైదానం, బ్రాహ్మణీకం లాంటి నవలలు, పురూరవ, సావిత్రి లాంటి నాటకాలు అనేకం రాశాడు. ఈయన వస్తువు, శైలి కూడా ఆంధ్ర సాహిత్యాన్ని మలుపు తిప్పింది.

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/16-18
Date of Posting : 02.05.2016 ▪ Date of Publication: 28.04.2016





If Un delivered please return to: Prasthanam, C/o M.H. Bhavan, Plot No. 21/1,
Near RTC Kalyana mandapam, Azamabad, Hyderabad - 500 020. Ph: 040- 27660013, Cell: 9490099059



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A170 |
| పుస్తకం పేరు | చేప్ను |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | K Daveed |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |